# మీ పిల్లలకి కాల్షియం-శాండ
# ఎందుకు ఇవ్వాలి?





## 32 గట్టి పళ్ల కోస
## పటిష్టమైన ఎముకల కా

పిల్లల యొక్క పళ్ళూ, ఎముకలూ పెరగటానికి పెద్దలకన్న రెట్టింపు కాల్షియం కావాలి. అందుకే పిల్లలకు రోజుకు కమ్మని, రాస్ప్‌బెరీ రుచిగల కాల్షియం – శాండోజ్ 4–6 బిళ్ళలు యిస్తే చాలు, పళ్ళు గట్టిబడి ఎముకలు పటిష్టమవుతాయి. దానితోబాటు వాళ్ళకు విటమిన్ సి, డి, బి12 కూడా అందుతుంది.

ముఖ్య విషయం: కాల్షియం–శాండోజ్‌లో, మీ శరీరం బాగా ఉపయోగించుకుంటుందని డాక్టర్లు చెప్పే కాల్షియం గ్లూకోనేట్ ఉంది.

పెరుగుదలకు
కాల్షియం తీసు
కాల్షియం తీసుక
4 నెలలలో చా
ఎదిగారని శాస్త్రీ
పరిశోధన రుజు




**కాల్షియం-శాండోజ్®**

**ప్రతి రోజు ప్రతివారికి**


రామ్
శ్యామ్‌లను
బంధించారు !


"అదిగదిగో అలా చూడు
ఆ నగల కొట్టు దగ్గర
ఆ దొంగల ముఠాని పట్టుకోవాలి"


"పోలీసులకు మనగురించి
తెలిసేముందే, ఏయ్ !
బంధించండా పిల్లలిద్దర్నీ
నాకళ్ళముందే"


"తోసేశారు ఓ పాతకారులోకి అతి
క్రూరంగా, తీసుకుపోయారు రామ్,
శ్యామ్‌లను ఎంతో దూరంగా"


ఓ కాళీ గుడిసెలో బంధించారు
మన బాలనాయకులిద్దర్నీ
గట్టిగా మూసేశారు


"ఇలారా, రామ్ దగ్గరికి ! భయపడకు
పోలీసులు త్వరలోనే
ఇక్కడికి రావడం ఖాయం"


"నేనొక్క చక్కని గుర్తు చేసినాను,
తింటూకూర్చో ఈ తీయని బిళ్ళలు
ఫలితం కనిపించేదాకా"


"పండ్ల రుచిగల పాపిన్స్ దారి
అంతటా విసిరాను, అవే మమ్మల్ని
రక్షించాయి ఈ నాడు"

heros' SI-142 B TEL

శ్రీలక్ష్మీ ప్రొడక్షన్స్

# రాజు వెడలె

ఈస్ట్మన్ కలర్

దర్శకత్వం: తాతినేని రామారావు  నిర్మాత: ఎ. పూర్ణచంద్రరావు



# చందమామ కేమెల్

రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు



బహుమతులు గెలుచుకోండి

1 సెట్—మొదటి బహుమతి రు. 15

1 సెట్—2వ బహుమతి రు. 10

1 సెట్—3వ బహుమతి రు. 5

1 సెట్—5 కన్సొలేషన్ బహుమతులు

1 సెట్—10 సర్టిఫికెట్లు

చుక్కలు వేసిన గీత వెంట కత్తిరించండి.



12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి. చందమామ : డాల్టన్ ఏజెన్సీస్, కొరింథీయాన్, ఫ్లేట్ నం. 5, 2వ అంతస్థు, 17, అర్థర్ బందర్ రోడ్, కొలాబా, బొంబాయి-400 005. ఫలితములు తుది నిశ్చయముగానే, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

పేరు________________________ వయస్సు__________

అడ్రసు________________________________________

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. 20-8-1976

VISION

CONTEST NO.3

'Name and address should be written in ENGLISH'

**Results of Chandamama-Camlin Colouring Contest No. 2 (Telugu)**

*1st Prize:* K Jagadamba, Vishakhapatnam. *2nd Prize:* Malempati Jma M. Rao. Guntur *3rd Prize:* B.Sitaratnam, Vishakhapatnam. *Consolation Prizes:* S. Ravikumar, Gudur. S. Chandra Bhanu, Madras. K. Santosh, Vishakapatnam. Adhikari Vijaykumar, Palakollu. Seeka Kolu Vijaylaxmi, Singarai Konda Prakasham Zilla. *Merit Certificates:* Seetal Venkatraman, Vijayawada. Chintaram Krishana, Toorpu. Angra V. Rao, Toorpu. Jama Nageshwar Rao, Mery Toorpu. Moogi Chandrashekhar Babu, Bhimavaram. J. Nehru, Vizianagaram. Y. Raveendhra Nath Reddy, Vidavalur. G. Mrudubashini, Siddipet. P. V. R. Lakshmi, Reddipalli. P. Umadevi, Nalgonda.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ నెల బేతాళకథ ["శిక్షించే హక్కు]" మ్రొమ సర్వోత్తమరెడ్డి రచన. పాలించే బాధ్యతగల వారికి నేరాలకు శిక్షలు నిర్ణయించే హక్కు కూడా ఉంటుంది. ప్రజలు ఆ హక్కును మన్నించి, గౌరవించాలి. అయితే పాలకులు తమ నియమాలకు తాము అతీతులమని అనుకోరాదు: తమ శిక్షాస్మృతులను తామే ఉల్లంఘించరాదు. అలా చేస్తే సామాన్య పౌరుడికి కూడా వారిని శిక్షించేహక్కు ఏర్పడుతుందని, యీ కథ చెబుతుంది.

---

సంపుటి 59 ఆగస్టు '76 సంచిక 2





## విచిత్ర కవలలు

## 38

నక్క కథ విని బ్రాహ్మణుడి భార్య, "సరే! ఇంట్లో వేయించిన నువ్వులున్నాయి. తెల్లవారుఝామునే అడవికి వెళ్ళి, కట్టెలూ, దర్భలూ తీసుకు రండి. అన్నం వండి, నువ్వులతో ముగ్గురు బ్రాహ్మణులకు భోజనం పెడతాను." అని భర్తతో అన్నది.

మర్నాడు తెల్లవారుఝామున బ్రాహ్మణుడు అడవికి వెళ్ళాడు. అతని భార్య నువ్వులు దంచి, పొట్టు చెరిగి, పాయసం చేదామని ఎండబెట్టింది. ఆమె వంటింట్లో పని చూసుకోవటానికి వెళ్ళిన సమయంలో ఒక కుక్క వచ్చి, ఆ నువ్వులను అశుద్ధి చేసింది.

ఇది చూసి బ్రాహ్మడి భార్య, "ఇవాళ బ్రాహ్మణులకు ఏం పెడతాను? ఒకటే దారి కనబడుతుంది. ఈ పొట్టు తీసిన నువ్వులను ముడినువ్వులకు మారకం వెయ్యాలి, ఆ తరవాత వంట చెయ్యాలి." అనుకున్నది.

ఆమె పొట్టు తీసిన నువ్వుపప్పు తీసుకుని పొరుగింటికి వెళ్ళి, "ఇది తీసుకుని సరికి సరి ముడినువ్వులు ఇస్తారా?" అని ఆ ఇంటావిడను అడిగింది.

లాభసాటి బేరం గదా అని ఆ ఇంటావిడ సంతోషంగా ఒప్పుకుని, బ్రాహ్మడి భార్యకు ముడినువ్వు లిచ్చింది. బ్రాహ్మడి భార్య వెళ్ళిపోయాక ఇంటావిడ తన కొడుకు కామందకితో తాను చేసిన లాభసాటి బేరంగురించి చెప్పి, "ఏమంటావు?" అన్నది.

కామందకి ఆమెతో, "ఈ మారకం బేరం చూస్తే అనుమానం కలుగుతున్నది. ఏదో కారణం లేకుండా ఎవరూ ఇలాటి

అట్ట చివరి బొమ్మ

నష్టపు బేరం చెయ్యరు. ఎవరా మనిషి?'' అని అడిగాడు.

ఫలాని బ్రాహ్మడి భార్య అని తల్లి చెప్పింది.

''అబ్బో, ఆమె చాలా గడుసుదీ, జిత్తులమారీనూ. అమ్మా, ఆ నువ్వుపప్పు అవతల పారెయ్యి. అది పనికివచ్చేదైతే ఆమె నీకు యిచ్చేదికాదు,'' అన్నాడు కామందకి.

అది నిజమని గ్రహించి, అతని తల్లి అలాగే చేసింది.

ఈ కథ చెప్పి బృహస్పతి చూడా కర్ణుడి వద్ద ఒక పార అడిగి పుచ్చుకుని నా కలుగు తవ్వ నారంభించాడు (అని ఎలుక చెప్పుకు పోయింది.)

నాకు చెడ్డ భయం వేసింది. ఎందు కంటే నేను నా కలుగులో చాలా బంగా రమూ, ఆహరమూ దాచుకున్నాను. అవి పోతాయని భయపడ్డాను గాని, వాళ్ళకి అడ్డు తగలలేను, తగిలితే నా ప్రాణాలకే ముప్పు.

వాళ్ళిద్దరూ నేను దాచినదంతా కాజేసి, బంగారాన్ని చెరిసగం పంచుకుని, పరమానందంతో కూర్చున్నారు. నా ఇల్లు పోయింది; సొత్తు పోయింది. మరొక చోటు చూసుకుందామని, అక్కడి నుంచి నా అనుచరులతో బయలుదేరాను.



నా అనుచరులు ఆకలి మీద ఉన్నారు. చూడాకర్ణుడి పాత్ర నుంచి ఆహారం తస్కరించటానికి సాహసించవచ్చునని వాళ్ళు అభిప్రాయపడ్డారు. సరే, వెనక్కు వెళ్ళాం. మా అలికిడి విని చూడాకర్ణుడు భిక్షాపాత్రను కర్రతో కొట్టాడు.

''కర్రను ఆడిస్తున్నా వెందుకు?'' అని బృహస్పతి అడిగాడు.

''ఆ దిక్కుమాలిన ఎలుక మళ్ళీ వచ్చింది,'' అన్నాడు చూడాకర్ణుడు.

"ఎందుకు భయపడతావు? దాని ఇల్లూ, సొత్తూ పోయాక, అది చచ్చినదాని కింద జమే. అదేమీ చేయ లేదు,'' అన్నాడు బృహస్పతి.

ఈ మాట విని మండిపోయి, నేను భిక్షాపాత్ర కేసి దూకాను; కాని పొట్టలో ఎత్తులేని కారణంచేత దాన్ని అందుకో లేక, తపీమని కిందపడ్డాను. బృహస్ఫతి వెదురు కర్రతో నన్ను చచ్చే దెబ్బ కొట్టాడు. విధిని నమ్మినవాడి కథలో లాగ ఆ దెబ్బను ఎలాగో తప్పించుకున్నాను.

"ఏమిటా కథ?" అని మంథరకం అడిగింది.

హిరణ్యకం ఇలా చెప్పింది:

విధిలో విశ్వాసం

ఉజ్జయిని మహా పట్టణంలో సాగర దత్తుడు అనే వర్తకుడు ఉండేవాడు. ఒకరోజు అతని కుమారుడు నూరు రూపాయలిచ్చి ఒక పుస్తకం కొనుక్కొని వచ్చాడు.

ఆ పుస్తకాన్ని చూసి సాగర దత్తుడు, "ఈ పుస్తకం ఎంత పెట్టి కొన్నావు?" అని కొడుకును అడిగాడు.

"నూరు రూపాయలు," అన్నాడు కొడుకు.

"మూర్ఖుడా, శ్లోకంలో ఒక్కపాదం మాత్రమే ఉన్న పుస్తకాన్ని నూరు రూపాయలిచ్చి కొన్నావా? ఇంత మంద మతివి నువ్వేమి డబ్బు సంపాదిస్తావు? నా ఇంటి నుంచి తక్షణం వెళ్ళిపో," అని సాగరదత్తుడు తన కొడుకును వెళ్ళ గొట్టాడు.

తన తండ్రి ఇలా చేసినందుకు ఎంతో నొచ్చుకుని కొడుకు చాలా దూరం ప్రయాణం చేసి కౌశాంబీ నగరం చేరి, అక్కడ నివసించసాగాడు. కొద్ది రోజులు గడిచాయి. అక్కడి వాళ్ళు అతన్ని, "ఎక్కడి నుంచి వచ్చావు? ఏం పని మీద వచ్చావు? నీ పేరేమిటి?" అని అడగసాగారు.

ఆ ప్రశ్నకు అతను, "విధి నిర్ణయం అనివార్యం," అని మాత్రం జవాబు చెబుతూ వచ్చాడు.

అందుచేత కౌశాంబీలో అందరూ అతన్ని "విధి నిర్ణయం" అని పిలవ సాగారు.





# మాయాసరోవరం

## 8

[ఏనుగును తమ మీదికి ఉసికొల్పిన మొసలి ఆకారం వాడికి, వైద్యులైన చరకాచారినీ, వీరనారాయుణ్ణీ చూపించి, గ్రామపెద్ద శాంతపరిచాడు. వీరనారాయుడు, మొసలి ఆకారం వాడి డొక్కలో దిగిన కత్తిని బయటికి లాగబోతున్న సమయంలో, దూరం నుంచి చరకాచారి ఆర్తనాదంతోపాటు, అడవి ఏనుగుల ఘీంకారాలు వినిపించినై. తరవాత—]

అడవి ఏనుగులు తన మీదికే దాడి వస్తున్నవని మొసలిఆకారంవాడు గ్రహించాడు. అవి కొంచెం చిన్నా, పెద్దా కలిసి ఆరు ఏనుగులు మాత్రమే. ఆ ఏనుగులు ఏనాడూ తన వాహనం అయిన జలగ్రహం లాంటి ఏనుగును చూసి వుండవు! దాని బలం, తన చేతిలోని శూలం శక్తి ఏపాటిదో తెలియగానే, యీ ఏనుగుల్లో చావగా మిగిలినవన్నీ, తిరిగి అరణ్యంలోని చెట్ల చాటుకు పారిపోవటం జరిగి తీరుతుంది....

మొసలిఆకారంవాడు యిలా ఆలోచించి, "జలగ్రహా! ఆ ముందు వస్తున్న ఏనుగును, నీ కోరలకు బలిపెట్టు," అంటూ అరిచాడు.

వాడి హెచ్చరిక వింటూనే జలగ్రహం దూకుతూపోయి, అందుబాటులోకి వచ్చిన అడవి ఏనుగు నొకదాన్ని, తన వాడి




దంతాలతో తల మీద బలంగా పొడిచింది. ఆ దెబ్బకు అడవి ఏనుగు ఘీంకరిస్తూ పక్కకు పడిపోయింది. అదేసమయంలో మొసలిఆకారంవాడు మరొక ఏనుగు కుంభస్థలం మీద శూలంతో గట్టిగా పొడిచాడు. ఆ పోటుకు అది తల వంచి ముందుకు కూలబడింది. జలగ్రహం దాన్ని కాళ్ళతో తొక్కుతూపోయి, మరొక ఏనుగు తలను తొండంతో బిగించి పట్టుకుని, కోరలతో కుమ్మింది.

ఈ విధంగా క్షణాల మీద మూడు అడవి ఏనుగులు బాగా గాయపడి నేల కొరిగినై. మిగిలిన ఏనుగులు వెనుదిరిగి పారిపోతున్నంతలో, మొసలిఆకారంవాడు తన శూలంతో అందినచోటనల్లా వాటి శరీరాల మీద పొడిచాడు. అవి బాధతో ఘీంకరిస్తూ అరణ్యం కేసి పరిగెత్తసాగినై. మొసలిఆకారంవాడు వాటిని కొంత దూరం తరిమి, ఆయాసపడుతూ తన వాహనాన్ని ఆపాడు. హఠాత్తుగా వాడికి తనకు చికిత్స చేయ వచ్చిన వీరనారాయుడు గుర్తుకొచ్చాడు. వాడేమైనట్టు? తనకూ అడవి ఏనుగులకూ జరిగిన పోరాటంలో, ఏనుగుల కాళ్ళ కింద పడి నలిగి చావలేదు గదా?

వాడికి యీ అనుమానం కలగ్గానే పై ప్రాణం పైనే పోయినట్టయింది. వాడు కళవెళ పడిపోతూ చుట్టూ ఓ మారు కలయచూసి, పెద్దగా గొంతెత్తి, "ఒరే, వీరనారాయుడూ, ఎక్కడ?" అని కేక పెట్టాడు.

ఆ వెంటనే మొసలిఆకారంవాడి వీపు వెనక నుంచి, "మొసలిదొరా, నేనిక్కడే వున్నాను: యింతసేపూ తమ తోక పట్టుకుని వేళ్ళాడుతున్నాను. మనం గెలిచామా, అడవి ఏనుగులు గెలిచినయ్యా?" అన్న జవాబు వచ్చింది.

ఆ మాట్లాడినవాడు వీరనారాయుడు. అతడు జలగ్రహం మీదికి అడవి ఏనుగులు దాడి రాగానే, దాని మీది నుంచి కిందికి దూకి పారిపోదామనుకుని, అలా పారిపో

చూడటం వల్ల, తను ఏనుగుల కాళ్ళ కింద పడి నలిగి చచ్చే ప్రమాదం వున్నదని భయపడి, సమయానికి చేతికందిన మొసలి ఆకారంవాడి తొడుగుకు వున్న తోక గట్టిగా పట్టుకుని కళ్ళు మూసుకున్నాడు. తరవాత జరిగిందేమిటో అతడికి అంతగా తెలియదు.



వీరనారాయుడి జవాబు విని మొసలి ఆకారంవాడు కాస్త స్థిమితపడి, "నువ్విక్కడే—జలగ్రహం మీద వున్నావన్నమాట, బతికిపోయాను! ఈ డొక్కలో విరిగిన కత్తిని ఎప్పుడు బయటికి లాగుతావు?" అన్నాడు.

"మొసలిదొరా, వేగిరపడకండి. తమరు అడవి ఏగుల మీది యుద్ధం గొడవలో అసలు సంగతి మరిచినట్టున్నది. చరకాచార్యులుగారు ఆ మధ్య, యీ దాపుల నుంచే ఒకటి రెండు చావు కేకలు పెట్టారు. ఆయన ఏవో మూలికలూ, ఓషధుల కోసం చెట్లల్లోకి వెళ్ళారు," అన్నాడు వీరనారాయుడు.

ఆ మాటలతో మొసలి ఆకారంవాడు గతుక్కుమని, "నిజమే, నిజమే! ఆ ఆచారి రక్షించండి అంటూ రెండు మూడు చావుకేకలు పెట్టాడు. తరవాత పలుకే లేదు. ఒకవేళ ఏ పెద్దపులో అతగాణ్ణి కరుచుకుపోతే, నా డొక్కలో యీ విరిగిన కత్తి అలా వుండిపోవలసిందేనా? దాన్ని బయటికి లాగి, నా గాయం మానే చికిత్స నువ్వు చెయ్యలేవా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు వీరనారాయుడు పక పక మంటూ నవ్వి, "శస్త్ర చికిత్స నేర్చిన నాకు, గాయం మాన్పే మందులే తెలియవనుకుంటున్నారా? బతుకు తెరువు పోటీ లేకుండా సాగిపోయేందుకు వీలుగా, నేనూ, ఆ ఆచార్యులూ ఒకళ్ళకు తెలిసిన వైద్యం మరొకళ్ళకు తెలియదన్నట్టు గ్రామంలో చిన్న నాటకం ఆడుతున్నాం. అలా చెయ్యకపోతే, గ్రామస్థులు మా ఇద్దరిలో ఒకళ్ళకే తిండీ తిప్పల సదు



దారు అడవి ఏనుగుల్ని ఎదుర్కొని జయించుకు రావటం సాధ్యమయే పనా!

"ఒరే, నారాయుడూ! అలా గుడ్లు మిటకరిస్తూ చూడక, యీ కత్తి త్వరగా లాగి, గాయానికి చికిత్స చెయ్యి." అన్నాడు మొసలి ఆకారంవాడు.

"మొసలి దొరా! ఆ చికిత్సకు అవసరం అయిన ఆకులూ, మూలికల కోసమే చరకాచార్యులుగారు ఆ అరణ్యావృక్షాల్లోకి వెళ్లింది. నేనైనా ముందుగా వాటిని సంపాయించకుండా కత్తిని బయటికి లాగటం తమకు ప్రమాదకరం అవుతుంది." అన్నాడు వీరనారాయుడు.

"నాకు ప్రాణం పోయేంత ప్రమాదం సంభవిస్తే, నువ్వూ నాతోపాటు ఆ మరో లోకానికి ప్రయాణం కట్టవలసిందే, తెలిసిందా? సరే, పద! ఆ ఆచారి ఎక్కడున్నాడో చూద్దాం. ఏ పులో, సింహమో అతగాణ్ణి పట్టుకుని ఆకలి చల్లార్చుకుని వుంటే, మిగిల్చిపోయిన బొమికలన్నా కంటబడకపోవు." అన్నాడు మొసలి ఆకారంవాడు.

ఆ తరవాత అతడు జలగ్రహాన్ని అదిలించి గుబురుగా వున్న అరణ్యావృక్షాల కేసి బయలుదేరాడు. చరకాచారి రక్షించండి అంటూ కేకలుపెట్టింది, ఆ వృక్షాల వెనకనుంచే.

పాయం చూస్తూ, రెండో వాళ్ళను తరిమేస్తారు." అన్నాడు.

ఆ జవాబుకు మొసలి ఆకారంవాడు కూడా పెద్దగా నవ్వబోయి, డొక్కలో వున్న కత్తి ఖలుక్ మనటంతో, పొట్ట పట్టుకుని చిన్నగా మూలిగి, "ఒరే, కపటపు వెధవా! నువ్వు నా తోక వదిలి ముందుకు రా!" అన్నాడు కోపంగా.

వీరనారాయుడు భయపడుతూనే, మొసలిఆకారంవాడి ముందుకు వచ్చాడు. వాడికిప్పుడు, యీ వింత ఆకారం వాడు ఎక్కిన ఏనుగు ఏదో పిశాచం అయి వుంటుందన్న అనుమానం పట్టుకున్నది. అలా కాకపోతే, ఒక్క ఏనుగు అయి

ఇప్పుడు చరకాచారి ప్రాణాలతో వున్నాడన్న మాటేగాని, మాట్లాడగలిగిన స్థితిలో మాత్రం లేడు. అంతకు కొద్దిసేపటికి ముందుగా అతడు, మొసలి ఆకారం వాడి గాయానికి కట్టు కట్టేందుకు చెట్ల కింద ఓషధుల కోసం వెతుకుతూ, ఒకచోట ఆగి, "ఆహా, యిక్కడ నేలఉసిరిక ఎంత నేవళంగా పెరిగింది! ఇది గ్రామ పెద్ద కీళ్ళ వాతానికి పనికి వస్తుంది," అంటూ మొక్కలను పీకేందుకు చప్పున వంగాడు.

చరకాచారి వంగిన ప్రదేశానికి పైన వున్న ఒక చెట్టు కొమ్మకు చుట్టుకుని ఒక పెద్ద కొండచిలువ ఆకటితో నకనకలాడుతున్నది. దానికి రెండు రోజులుగా ఆహారం దొరకలేదు. కంటబడితే, ఆ ఆకలి మైకంలో అది పెద్దపులి మీదనైనా, ఏనుగు మీదనైనా పడి పట్టుకునేందుకు సిద్ధంగా వున్నది. అలాంటి కొండచిలువకు, కొమ్మ దిగువగా చరకాచారి కనిపించగానే, అది తపీమంటూ అతడి మీదికి జారింది.

కొండచిలువ పైనుంచి మీదపడగానే, చరకాచారి ఏ చెట్టుకొమ్మో విరిగి మీద పడిందనుకుని, దూరంగా పరిగెత్తబోయాడు. కాని అతడికాళ్ళూ, చేతులూ ఆడలేదు. ఆచారి భయకంపితుడై పోయేంతలో అతడి శరీరాన్ని మెలిపెడుతూ, పెద్ద కొండచిలువ అతడి కంటబడింది. మరుక్షణం అతడు,





"రక్షించండి! రక్షించండి!" అంటూ కేకలు పెట్టాడు.

ఈ కేకలను జొన్న చేల దగ్గిర వున్న మొసలి ఆకారం వాడూ, గ్రామస్థులతో పాటు; ఆ సమయంలో అటుకేసి వస్తున్న జయశీలుడూ, సిద్ధసాధకుడూ కూడా విన్నారు. వాళ్ళిద్దరూ పొదలో దొరికిన తాళపత్రగ్రంథం తీసుకుని, దాన్ని అక్కడ వదిలిన వాడి కోసం అరణ్యంలో వెతుకుతున్నారు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ రక్షించండి అనే కేకలైతే విన్నారు గాని, అలా కేకలు పెడుతున్న చరకాచారి మాత్రం వాళ్ళకు కనిపించలేదు. ఇద్దరూ ఆ ధ్వని వచ్చిన వైపుకు కొంత దూరం నడిచే సరికి, అడవి ఏనుగుల ఘీంకారాలూ, వాటితో వింత ఏనుగు నెక్కిన మొసలి ఆకారం వాడు శూలం తీసుకుని పోరాడుతూండటం కనిపించింది.

సిద్ధసాధకుడు ఆవేశపడి గెంతుతూ, తన చేతిలోని దండాన్ని పైకెత్తి, "జయశీలా! మన కనకాక్షరాజుగారి పిల్లలను ఎత్తుకుపోయిన దుర్మార్గుడు వీడే! నేను ముందే చెప్పినట్టు వీడు యక్షుడో, గంధర్వుడో, కిన్నెరుడో అయి వుంటాడు!" అన్నాడు.

"నువు చెప్పే వాళ్ళలో వాడెవడైనా కాకపోయినా, మనలాంటి మనిషి మాత్రం కాడు. వాడెక్కివున్న ఏనుగు చూడు! అలాంటి దాన్ని మనం కలల్లో కూడా చూసి వుండం," అన్నాడు జయశీలుడు.

అంతలో మరొకసారి చరకాచారి చేసిన ఆర్తనాదం వినిపించింది. జయశీలుడు వెంటనే కత్తి దూసి, "భయపడకు, వస్తున్నాం!" అంటూ అటు కేసి బయలుదేరాడు.

సిద్ధసాధకుడు ఎక్కడలేని ఆశ్చర్యంతో, "జయశీలా, యిదేంపని? యువరాణీ, యువరాజుల్ని అపహరించుకు పోయిన దుష్టుడు కళ్ళఎదట కనిపిస్తూంటే, వాణ్ణి

వదిలి, ఎవడో ఆటవికుడు ఏ క్రూర మృగం వాతబడో అరుస్తూంటే, వాణ్ణి కాపాడేందుకు పోతున్నావా ?'' అన్నాడు.

''అవును, సాధకా! మనం తక్షణం సాయపడక పోతే, వీడెవడో ప్రాణాలే కోల్పోతాడు. యువరాజూ, యువరాణులు అంత ప్రాణాపాయస్థితిలో వున్నారను కోను,'' అంటూ జయశీలుడు పరిగెత్త సాగాడు. అతడి వెనకగా సిద్ధసాధకుడు కూడా పరిగెత్తాడు.

ఇద్దరూ చరకాచారిని సమీపించే సమయానికి, కొండచిలువ అతడి శరీరాన్ని బలంగాచుట్టి నోటితో అతడి తలను పడిసి పట్టుకునేందుకు ప్రయత్నం చేస్తున్నది. చరకాచారి చెట్టుబోదెకు నిలువుగా అనుకునివున్నాడు. అతడింకా బతికేవున్నాడన్న సూచనగా, అతడి చేతివేళ్లు మాత్రం కదుల్లాడుతున్నవి.

జయశీలుడు దూకుతూపోయి కత్తితో కొండచిలువ తలను, చరకాచారి తల నుంచి దూరంగా నెట్టేందుకు ప్రయత్నించాడు. తన కత్తి దెబ్బ, పాములో నుంచి దూసుకుపోయి మనిషికి తగులుతుందేమో అని అతడికి భయంకలిగింది. కాని, బలమైన కొండచిలువ బాగా ఆకలిగొని వున్నదేమో—జయశీలుడి కత్తిని తలతో గట్టిగా పక్కకు నెట్టింది.



''జయశీలా, వీడు ఆటవికుడు కాదు; చదువు సంధ్యలు నేర్చిన పండితుడిలా వున్నాడు. త్వరగా పామును చంపు,'' అన్నాడు సిద్ధసాధకుడు, చరకాచారి కేసి పరీక్షగాచూస్తూ.

జయశీలుడు కొండచిలువ తలను ఎడమ చేతితో పట్టుకుని వెనక్కు లాగుతూ, కత్తితో దాని తల కింది భాగం మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు సగం తల తెగిన పాము గిలగిల్లాడుతూ, చరకాచారిని చుట్టబెట్టిన శరీరభాగమంతా వూడిపోగా, దభీమంటూ నేలమీద పడింది.

కొండచిలువతోపాటు కింద పడబోయిన చరకాచారిని, జయశీలుడు పట్టుకుని,

"సాధకా! త్వరగాపోయి నీళ్లు తీసుకురా. మనిషి దిమ్మెరపోయాడు తప్ప, బతికే వున్నాడు." అన్నాడు.

సిద్ధసాధకుడు పరుగు పరుగునపోయి, దాపులనున్న కొలనులోంచి కమండలంతో నీరు తీసుకుని, తిరిగి వచ్చాడు. జయశీలుడు ముఖం మీద నీళ్లు చల్లగానే చరకాచారి కళ్ళు తెరిచి, "నేనెక్కడున్నాను? బతికే వున్నానా, కొండచిలువ పొట్టలో వున్నానా?" అన్నాడు పెద్దగా మూలుగుతూ.

"నువ్వు బతికే వున్నావు. ముందు యీ మంత్రజలం తాగు. నిన్ను పట్టిన నిస్త్రాణా, ప్రాణభయం పోతుంది." అంటూ సిద్ధసాధకుడు, చరకాచారి చేత నీళ్ళు తాగించాడు.

అంతవరకూ సగం మైకంలో వణికిపోతున్న చరకాచారి అప్పుడు కళ్ళు పూర్తిగా తెరిచి, చుట్టూ కలయచూస్తూ, "మీరెవరు? ఆ మొసలి ప్రభువెక్కడ? వీరనారాయుడేమయ్యాడు?" అన్నాడు.

ఆ ప్రశ్నతో జయశీలుడికి, చరకాచారి ఎవర్ని గురించి మాట్లాడుతున్నాడో అర్థమైపోయింది. అతడు సిద్ధసాధకుడితో, "సాధకా, ఇతడి మాటలు విన్నావా? ఆ వింత ఏనుగు మీద వున్న మొసలి ఆకారం వాడితో, యితడికేదో నేస్తం వున్నది." అని చరకాచారితో, "నీ పేరేమిటి? ఆ మొసలి ఆకారం వాడికి నువ్వు బంటువా, స్నేహితుడివా?" అని అడిగాడు.

చరకాచారి జవాబు చెప్పేలోపల మొసలి ఆకారంవాడు చెట్లచాటు నుంచి ముందుకు వచ్చి, "ఈ చరకాచార్యులు నా సొంత వైద్యుడు. మీ రెవరు? నిజం చెప్పకపోయారో, నా జలగ్రహంతో మిమ్మల్ని నజ్జునజ్జయేలా తొక్కిస్తాను," అన్నాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ లేచి నిలబడ్డారు. జయశీలుడు కత్తి పిడిమీద చేయివేశాడు. సిద్ధసాధకుడు దండం ఎత్తి పట్టుకున్నాడు. —(ఇంకావుంది)






# శిక్షించే హక్కు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు పూనుకున్న ఈ దుర్ఘటమైన పనిని ఏ నమ్మకస్తుడైన భృత్యుడికో అప్పగించనందుకు నీ వివేకాన్ని మెచ్చుకుంటున్నాను. ఏమంటే, ఎంత నమ్మకస్తుడైన భృత్యుడు కూడా అవకాశం దొరికితే రాజద్రోహిగా మారిపోగలడు. ఇందుకు నిదర్శనంగా నీకు విష్ణుగుప్తుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం పాంచాలదేశాన్ని గుణసింహుడు అనే రాజు పాలించేవాడు. ఆయన పరిపాలనలో మంచి క్రమశిక్షణ ఉండేది. దొంగతనమూ, లంచగొండి



తనమూ లాటి నేరాలకు చాలా కఠినమైన శిక్షలుండేవి.

గుణసింహుడు అప్పుడప్పుడూ మారు వేషంలో సంచరిస్తూ, నేరాలు చేసేవారిని స్వయంగా పట్టుకునేవాడు. అలాగే ఆయన మారువేషంలో నారాయణపురం అనే గ్రామానికి వెళ్ళి, అక్కడి న్యాయాధికారి అయిన ధనగుప్తుడు లంచగొండి అని చూచాయగా విన్నాడు. ఆ సంగతి నిజమో, కాదో తెలుసుకునేటందుకు ఆయన ఒక పథకం వేశాడు.

ఆ పథకం ప్రకారం గుణసింహుడూ, ఆయన మంత్రీ మారువేషాలతో ధనగుప్తుడి వద్దకు వెళ్ళి, తమ ఇద్దరి మధ్యా ఒక వివాదం ఉన్నట్టు సృష్టించారు. సాక్ష్యం చూస్తే మంత్రి పక్షానే న్యాయం ఉన్నట్టు కనబడింది. ధనగుప్తుడు అంతా విని, మర్నాడు తీర్పు చెబుతానన్నాడు. ఆ రాత్రి రాజు ధనగుప్తుణ్ణి కలిసి, తనకు అనుకూలంగా తీర్పు చెబితే వంద మొహర్లు ఇస్తానన్నాడు. డబ్బుకు ఆశపడి ధనగుప్తుడు మర్నాడు రాజుకే అనుకూలంగా తీర్పు చెప్పాడు తీర్పు వింటూనే రాజూ, మంత్రీ తమ అసలు స్వరూపాలు బయటపెట్టి, ధనగుప్తుణ్ణి బంధించి రాజధానికి తీసుకుపోయి, విచారణ జరిపి, మరణశిక్ష విధించారు. శిక్ష వెంటనే అమలు జరిగింది.

రాజు చేసిన ఈ పనికి నారాయణపురంలో చాలామంది రాజును నిందించారు. లంచగొండితనానికి మరణశిక్ష విధించటం పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం ప్రయోగించటమేనని అందరికీ తోచింది.

అలా రాజును నిందించనివాడు ధనగుప్తుడి కొడుకు విష్ణుగుప్తుడు. అతను పెద్ద ఆదర్శాలు గలవాడు. సమర్థతతో పరిపాలించే రాజు అందుకుగాను ఎలాంటి శిక్షావిధానం అవలంబించినా తప్పు లేదనీ, తన తండ్రి నేరం శిక్షార్హమైనదేననీ అతను నమ్మాడు.

కాలక్రమాన విష్ణుగుప్తుడు తన విద్య పూర్తిచేసుకుని, రాజు కొలువులో చేరాడు.

్నతమైన ఆదర్శాలు గలవాడూ, రుకైనవాడూ, విశ్వాసపాత్రుడూ వటంచేత అతను కొద్దికాలంలోనే రాజు ఆంతరంగికులలో ఒకడుగా అయాడు.

ఇలా ఉండగా పాంచాలదేశం మీదికి శత్రురాజు దండెత్తి వచ్చాడు. ఆరంభం లోనే పాంచాలసేనలు తీవ్రంగా దెబ్బతి న్నాయి; అపజయం తప్పనట్టుకనబడింది.

ఆ పరిస్థితిలో గుణసింహుడు శత్రు రాజును మోసంతో చంపించటానికి పథకం వేశాడు. ఆయన విష్ణుగుప్తుడితో ఈ పథకం చెప్పి, శత్రుశిబిరానికి చెందిన ఒక అంగ రక్షకుడి చేత శత్రురాజును చంపిస్తున్నా ననీ, వాడు ఆ పని చేసినందుకు లక్ష వరహాలు వాడికి లంచం ఇయ్యవలసి ఉంటుందనీ అని, ఆ లక్ష వరహాలనూ విష్ణుగుప్తుడికి ఇచ్చి, ఆ సొమ్ము ఆ అంగ రక్షకుడికి అందజెయ్యమన్నాడు.

విష్ణుగుప్తుడు లక్షవరహాలూ తీసుకుని, అంగరక్షకుడికి అందించటానికి ఒప్పు కున్నాడు. కాని అతను అలా చెయ్యక, తిన్నగా శత్రురాజు వద్దకు వెళ్ళి, ఆయనను హత్య చెయ్యటానికి జరిగిన కుట్ర చెప్పి, పాంచాలదేశపు సైనిక రహస్యాలన్నీ తెలిపి, శత్రురాజుకు అనేక విధాల సహాయం చేశాడు. దాని ఫలితంగా శత్రురాజుకు మరింత తేలికగా యుద్ధంలో విజయం లభించింది.

గుణసింహుణ్ణి విష్ణుగుప్తుడే స్వయంగా చంపాడు. చంపే ముందు తాను తన



తండ్రి చావుకు పగతీర్చుకుంటున్నట్టు గుణసింహుడితో చెప్పాడు. శత్రురాజు పాంచాలదేశాన్ని తన తరఫున పాలించటానికి విష్ణుగుప్తుణ్ణి నియమించాడు. విష్ణుగుప్తుడు కూడా గుణసింహుడి లాగే సమర్థతతో పాలించాడు. అయితే అతను నేరస్థులను దారుణంగా శిక్షించక, నేరాలకు తగిన శిక్షలనే విధిస్తూ వచ్చాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, విష్ణుగుప్తుడు మొదటి నుంచీ రాజద్రోహబుద్ధిగలవాడా, లేక అకస్మాత్తుగా మారాడా? మారితే మార్పుకు కారణమేమిటి? రాజ్యం మీద ఆశా? లక్ష వరహాలూ తానే కాజెయ్యాలన్న దుర్బుద్ధా? తన తండ్రి చావుకు పగతీర్చుకునే ఉద్దేశం అతనికి అకస్మాత్తుగా ఎందుకు కలిగింది? రాజుగారి అంతరంగికుడుగా అతను ఎప్పుడైనా రాజును చంపి ఉండవచ్చుగద! ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "విష్ణుగుప్తు మొదట నిజంగా రాజభక్తిగలవాడే. త తండ్రికి రాజు ఇచ్చిన మరణదండన త తండ్రి నేరానికి, అంటే లంచగొండితనానికి, తగిన శిక్షే అని కూడా అతను నమ్మాడు, కాని ఆ రాజే యుద్ధంలో విజయం కోసం శత్రురాజు అంగరక్షకుడికి లక్షవరహాలు లంచం ఇయ్యటానికి సిద్ధమయాడు. అందుకు మరణదండన న్యాయమైతే రాజును చంపటం తప్పనిసరి. అది సరి అయిన శిక్ష కాని పక్షంలో తన తండ్రి శిక్ష పొందలేదు, హత్య చేయబడ్డాడు. దానికి పగతీర్చుకోవటం విష్ణుగుప్తుడి విధి. ఎలా చూసినా విష్ణుగుప్తుడి ప్రవర్తనలో తప్పు పట్టటానికేమీ లేదు. అతని ఉన్నతాదర్శాల ముందు రాజభక్తి ఓడిపోయింది. అదే అతనిలో కలిగిన పెద్ద మార్పుకు కారణం," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# ముందుచూపు

పూర్వం వంగరాజ్యాన్ని మలయ సింహుడు పాలించేవాడు. వంగదేశాన్ని అనుకుని ఉన్న అంగదేశాన్ని రాజ సింహుడు పాలించేవాడు. రెండు దేశాల రాజులమధ్యా, ప్రజలమధ్యా కూడా బంధుత్వాలు ఉండేవి. ఉభయదేశాల మధ్యా పరస్పర సహకారం ఉండేది.

ఇలా ఉండగా కళింగ రాజైన చంద్ర వర్మ ఆకస్మికంగా అంగరాజ్యం మీద యుద్ధం చేశాడు. అంగరాజైన రాజ సింహుడూ, అతని సైన్యాలూ వీరోచితంగా పోరాడినా అపజయం తప్పలేదు. రాజ సింహుడు వంగదేశం పోయి, మలయ సింహుడి అండన చేరాడు. నిజానికి రాజ సింహుడు అంత సమర్థుడైన పాలకుడు కాడు. అయినా అంగదేశానికి సంభవించిన పరాజయం తమ పరాజయంగానే భావించారు వంగదేశ ప్రజలు. మలయ సింహుడు రాజసింహుడి పట్ల సానుభూతి చూపాడు. అతను తలుచుకుంటే రాజ సింహుడి ఓటమికి ప్రతీకారం చెయ్యగల శక్తిగలవాడే. అయినా ఎందుకో అతను అలాటి ప్రయత్నం ఏమీ చెయ్యకుండా ఊరుకున్నాడు.

ఒకప్పుడు మలయసింహుడు ఎవరికీ తెలియకుండా తన అంగరక్షకులతో అంగ రాజ్యం ప్రవేశించాడు. అక్కడ అతనికి ఏ విధమైన అలజడీ కనిపించలేదు. కొత్త రాజైన చంద్రవర్మను గురించి ప్రజలలో ద్వేషంగాని, ఓడిపోయిన రాజు గురించి విచారంగాని ఉన్న జాడలు కనిపించలేదు; తమ జీవితాలు తాము, ఏమీ జరగనట్టే, జీవిస్తున్నారు.

ఎంత కాలం గడిచినా మలయ సింహుడు అంగరాజ్యాన్ని కళింగరాజు నుంచి విడిపించటానికి తన సైన్యాలను

ఎస్. వి. కామిశెట్టి

ఆయత్తం చెయ్యకపోవటం చూసి రాజసింహుడు తనకు అవమానం జరిగినట్టుగా భావించి, మరొక పొరుగురాజును ఆశ్రయించి, ఆ రాజు అందించిన సైనిక సహాయంతో చంద్రవర్మ మీదికి యుద్ధానికి వెళ్ళాడు. కాని అతనికి ఈసారి కూడా అపజయమే కలిగింది.

రాజసింహుణ్ణి ఆదుకునేవారు బలవంతులెవరూ లేరని చంద్రవర్మకు తెలిసిపోయింది. మలయసింహుణ్ణి గురించే అతను ఇంతకాలమూ భయపడుతూ వచ్చాడు. కాని మలయసింహుడు రాజసింహుడికి సహాయపడడని తేలిపోయింది. అందుకే రాజసింహుడు మరొకరిని ఆశ్రయించవలసి వచ్చింది.

ఇప్పుడు చంద్రవర్మ అంగరాజ్య పరిపాలనలో తీవ్రమైన మార్పులు చేసి, కొత్త రాజకీయ విధానాలు అమలు జరిపాడు. కీలకస్థానాలన్నిటిలోనూ కళింగులు నియమించబడ్డారు. వారికి పెద్దపెద్ద వేతనాలూ, సౌకర్యాలూ కలిగించబడ్డాయి. కళింగ పరిశ్రమలకు ఎక్కువ ప్రోత్సాహం ఇయ్యబడింది. కళింగలో తయారైన వస్తువులకే అంగదేశంలో ఎక్కువ చలామణీ లభించింది. అంగదేశాన్ని కళింగదేశం దోచుకునేటందుకు తగిన సదుపాయాలన్నీ చేయబడ్డాయి. సహజంగా అంగప్రజల శ్రమా, దరిద్రమూ హెచ్చిపోయాయి. ఆ మేరకు కళింగుల సుఖమూ, సంపదా పెరిగాయి.



అంగదేశంలో కొందరు రాజనీతి తెలిసినవారు జరుగుతున్నవి గ్రహించి, తమ అసంతృప్తిని రాజుకు తెలియజేశారు. అలాటివారి వల్ల తనకు ప్రమాదం ఉంటుందని గ్రహించి చంద్రవర్మ వారి మీద లేని నేరాలు మోపి, ఉరిశిక్షలు అమలుచేశాడు.

ఇది చూసిన ప్రజలలో ఆందోళన బయలుదేరింది. కొంతమంది వంగదేశానికి వెళ్ళి, మలయసింహుడికి పరిస్థితి అంతా చెప్పి, తమ దేశాన్ని చంద్రవర్మ దుష్పరిపాలన నుంచి రక్షించమని కోరారు. కాని మలయసింహుడు వారి సూచన పట్ల ఏమంత ఆసక్తి చూపలేదు. మలయసింహుడే తమను ఉపేక్షిస్తే ఇక తమను కాపాడేవారు లేనేలేరని వాళ్ళు గ్రహించి, ఎంతగానో విచారపడుతూ తమ దేశానికి తిరిగి వెళ్ళిపోయారు.

సామాన్య ప్రజలలోనూ, యువకులలోనూ తిరుగుబాటు సాగింది. చంద్రవర్మ దానిని అతిక్రూరంగా అణచటానికి రాజ్యమంతటా రాక్షస పరిపాలనా విధానం అవలంబించాడు.

ఈ సమయంలో మలయసింహుడు మరొకసారి మారువేషంలో అంగదేశం ప్రవేశించాడు. ప్రజలలో చంద్రవర్మ పట్ల పూర్తిద్వేషం కనబడింది. వాళ్ళు ఇప్పుడు శాసనాలకు తల ఒగ్గక, రహస్యచర్యలు సాగిస్తున్నారు. రాజకీయ యంత్రాంగానికీ, ప్రజలకూ మధ్య పైకి కనబడకుండా



లోలోపల అతితీవ్రమైన సంఘర్షణ సాగుతున్నది.

ఇది చూసిన మలయసింహుడు అకస్మాత్తుగా చంద్రవర్మ రాజ్యం మీద రెండుదిక్కుల నుంచి దాడిచేశాడు. అనుకోకుండానూ, అతి తీవ్రంగానూ జరిగిన ఆ దాడికి చంద్రవర్మ తట్టుకోలేక పోయాడు. మలయసింహుడు దాడిచేస్తున్నట్టు తెలియగానే ప్రజలు బహిరంగంగా తిరుగుబాటు చేసి, చంద్రవర్మ రాజ్యాంగాన్ని క్షణంలో ధ్వంసం చేశారు. చంద్రవర్మ ఓడిపోయి, మలయసింహుడికి బందీగా చిక్కాడు.

మలయసింహుడు రాజసింహుణ్ణి పిలిపించి, అతనికి అంగరాజ్యాధిపత్యం ఇస్తూ ఇలా అన్నాడు: "చంద్రవర్మతో యుద్ధం చేసి ఓడిపోయినందుకు నేను నిన్ను తప్పు పట్టను. కాని నీ పరిపాలనలో ఉండిన అంగ ప్రజలు చంద్రవర్మ పరిపాలన కిందికి వచ్చినప్పుడు వారికి చీమ కుట్టినట్టయినా లేకపోవటం గమనించాను. దానినిబట్టి నీ మీద నీ ప్రజలకు ప్రత్యేకమైన విశ్వాసం లేదని గ్రహించాను. అది నీ తప్పు. నువు ప్రజల అభిమానాన్ని సంపాదించుకోలేకపోయావు. అయినా, నా బంధువువు గనకా, మిత్రుడివి గనకా నీకు సహాయంచేసి చంద్రవర్మను అనాడే ఓడించి ఉందును. కాని అందువల్ల ప్రయోజనం ఉండదు. మరొక బలవంతుడు నీకు ఇదేగతి తెచ్చిపెట్టి ఉండును. అందుచేత నీ ప్రజలలో స్వేచ్ఛాప్రియత్వమూ, ఆత్మరక్షణాసక్తి పెరిగేదాకా చూస్తూ ఊరుకున్నాను. అంగ ప్రజలకు ఆ రెండూ తెలిసివచ్చాయి. వారు ఇక నీ పైన ఆధారపడరు. ఇక నువు పాలించేది చైతన్యం గల ప్రజలను. ఇప్పుడు నీ దేశాన్ని ఎవరూ జయించలేరు."

మలయసింహుడి వైఖరిని అర్థంచేసుకోలేనందుకు రాజసింహుడు పశ్చాత్తాపపడ్డాడు. ప్రజల సహకారంతో అతను దేశాన్ని పూర్వంకన్న చాలా సమర్థతతో పాలించాడు.



# 176. జియస్ దేవాలయ శిథిలాలు

ఏథెన్స్ (గ్రీసు) వద్ద గ్రీకులు నిర్మించిన గొప్ప దేవాలయం. దీని శిథిలాలు ఇప్పుడు ఈ రూపంలో మిగిలి ఉన్నాయి. జలప్రళయం ముగిసినప్పుడు నీరు ఆఖరున తీసిపోయింది ఇక్కడే నని చెబుతారు. ఆర్యుల దేవుడు "ద్యౌస్" అన్న పేరుకు మారురూపమే "జియస్" అని పండితుల అభిప్రాయం.





# శ్రీపతి దూరాలోచన

శ్రీపతి అడావుడి మనిషి. అతను ఏ ఆలోచన చేసినా ఏదో ఒక ఆటంకం ఎదురవుతూనే ఉండేది. అతని భార్య బాపాయమ్మ ఇరుగు, పొరుగు అమ్మలక్కలతో, "నా మొగుడికి దూరాలోచన బొత్తిగా లేదు. ముందూ, వెనకా ఆలోచించకుండా ఏదో చేసేసి, లేనిపోని గొడవ నెత్తికి తెచ్చుకుంటాడు. కట్టుకున్న పాపానికి నేనూ అంతో, ఇంతో అనుభవించక తప్పదు." అని రోజూ మొరపెట్టుకునేది. అది శ్రీపతికి కష్టంగా ఉండేది. తను కూడా ముందుచూపుతో పనులు చేయగలడని ఎలాగైనా నిరూపించాలని అతనికి పట్టుదలగా ఉండేది.

ఒకసారి శ్రీపతి పొరుగూర్లో జాతర జరుగుతూంటే చూడటానికి వెళ్ళాడు. సాయంత్రందాకా జాతర అంతా చుట్టి, తనకు కావలసిన వస్తువులు తీసుకుని, తిరుగుప్రయాణం అయాడు. ఆ సమయంలో ఒక మిఠాయి దుకాణం ఎదురుగా నిలబడి ఉన్న అయిదేళ్ళ కుర్రవాడు కనిపించే సరికి శ్రీపతి కళ్ళు తళుక్కున మెరిశాయి. ఆ కుర్రవాడు మరెవరో కాదు; వాళ్ళ ఊరి పెద్దశ్రేష్ఠి కొడుకు.

ఆ కుర్రవాడు ఆ క్రితం రోజే ఆటలకు వెళ్ళి మరి తిరిగి రాలేదు. శ్రేష్ఠి కంగారు పడి, నాలుగు వైపులకూ మనుషులను పంపాడు. ఆ సమయంలో శ్రీపతి శ్రేష్ఠి గారి ఇంటి మీదుగా వెళుతూ ఉండటం జరిగింది. శ్రేష్ఠి నలుగురు పెద్దలూ వింటూండగా, "సురక్షితంగా అబ్బాయిని తెచ్చిన వారికి నూట పదహార్లు ఇస్తాను." అనటం శ్రీపతి విని ఉన్నాడు. అప్పుడు శ్రీపతి ఆ మాటలను అంతగా పట్టించుకోలేదు. అయితే అనుకోకుండా ఆ పిల్లవాడు

ఎం. కామేశ్వరరావు

లో కంటపడేసరికి ఒక గొప్ప ఆలో కలిగింది.

శ్రీపతి వెంటనే కుర్రవాడిని ఎత్తుకుని, "మిఠాయి తింటావా, బాబూ?" అని అడిగాడు.

కుర్రవాడు తింటా నన్నట్టుగా తల ఊపాడు.

శ్రీపతి ఐదురూపాయలు ఖర్చుపెట్టి, రకరకాల తినుబండారాలూ, ఆటవస్తువులూ పిల్లవాడికి కొని ఇచ్చి, వాణ్ణి భుజాన ఎక్కించుకుని, చల్లగా తమ ఊరు చేరి, తిన్నగా ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు.

తలుపు తీసిన బాపాయమ్మ, "ఎవడీ కుర్రాడు? ఈ సంతని ఇంటి మీదికి తెచ్చావు దేనికి? వాడి ఆటసామానులన్నీ నువు డబ్బు తగలేసి కొనలేదు గద?" అని అనుమానంగా అడిగింది.

శ్రీపతి గుమ్మంలోనే నిలవేసిన పెళ్లాం మీద విసుక్కుంటూ, "ముందు లోపలికి రానీ. వీడి సంగతి చెబుతాను. వీడు పెద్ద శ్రేష్ఠి ఆఖరు కొడుకు. కనబడకుండా పోయాడు. వీణ్ణి అప్పజెబితే శ్రేష్ఠి నూట పదహార్లు బహుమానం ఇస్తాడు," అంటూ సంగతంతా చెప్పాడు.

బాపాయమ్మ మూతి విరిచి, "ఎంత డబ్బిస్తే మాత్రం ఏం లాభం! కామాక్షమ్మ




కట్టుకున్న చీరలాంటిది కొంటావే, లేదో! అయినా వీణ్ణి ఇక్కడికి తెచ్చావు దేనికి? శ్రేష్ఠి ఇంటికే పట్టుకు వెళ్లలేకపోయావా?" అన్నది.

"నీ మతి మండినట్టే ఉన్నది! బొత్తిగా దూరాలోచన లేదు. పిల్లవాణ్ణి పుచ్చుకుని శ్రేష్ఠి తొంట చెయ్యి చూపిస్తే మనం ఏం చెయ్యగలం? సాక్ష్యం ఏం ఉన్నదీ? తెల్లవారాక నలుగురు పెద్ద మనుషులను వెంటబెట్టుకుని వెళ్ళితే, శ్రేష్ఠి చచ్చినట్టు డబ్బంతా అణా పైసలతో కక్కుతాడు," అన్నాడు శ్రీపతి.

భర్త దూరాలోచనకు ముచ్చటపడి పోయింది బాపాయమ్మ.

కుర్రాడు భోజనం చేసి, పాలుతాగి, అవి అరిగేదాకా అల్లరిచేసి, నిద్రపోయాడు. శ్రీపతి కుర్రవాడి పక్కనే పడుకున్నాడు.

తెల్లవారుఝామున ఎవరో తలుపు తట్టుతూ ఉంటే, శ్రీపతి కళ్ళు నులుము కుంటూ వెళ్ళి తలుపు తెరిచాడు. వచ్చిన వాళ్ళు నలుగురూ రాజభటులని తెలియగానే శ్రీపతి నిద్రమత్తు పూర్తిగా వదిలింది.

వాళ్ళు నలుగురూ శ్రీపతిని పక్కకు నెట్టి లోపలికి వచ్చి, శ్రేష్ఠి కొడుకును చూసి తృప్తిపడి, శ్రీపతితో, "వెంటనే రాజుగారి దగ్గిరికి పద! చిన్నపిల్లల్ని ఎత్తుకు వెళ్ళడం పెద్దనేరం. నిన్న జాతరలో నుంచి శ్రేష్ఠిగారి పిల్లవాణ్ణి నువు ఎత్తుకువచ్చినట్టు వాకబుచేస్తే తెలిసింది," అన్నారు.

శ్రీపతి పై ప్రాణాలు పైనే పోయాయి. అతను పిల్లవాడు తప్పిపోయిన వైనం అంతా చెప్పి, "జాతరలో నుంచి పిల్లవాడని శ్రేష్ఠికి అప్పజెప్పాలనే తీసుకు వచ్చాను. పిల్లవాడు కనబడకుండా పోయినట్టు అంతకు ముందు విన్నాను," అన్నాడు.

"పిల్లవాడు ఆటలకి వెళ్ళి, ఎవరింటిలోనో నిద్రపోయాడట. వాడు కొద్దిసేపటికే దొరికాడు. నిన్న శ్రేష్ఠిగారి కుటుంబమంతా కలిసి జాతరకు వెళ్ళినప్పుడు పిల్లవాడు కనబడలేదు. వాణ్ణి ఎత్తుకు వచ్చినవాడివి వెంటనే శ్రేష్ఠిగారికి ఎందుకు అప్పజెప్పలేదు? ఏదో దురుద్దేశం లేకపోతే పిల్లవాణ్ణి నీ ఇంట్లో ఎందుకు దాచావు?" అంటూ రాజభటులు, శ్రీపతి ఏం చెప్పినా వినిపించుకోకుండా, రాజుగారి వద్దకు ఈడ్చుకుపోయారు.

ఆ తరవాత శ్రీపతి, తాను నిర్దోషినని రుజువు చేసుకోవడానికి, బోలెడంత డబ్బు ఖర్చుచెయ్యవలసి వచ్చింది. చావు తప్పి కన్నులొట్టబోయినట్టయి శ్రీపతి ఇంటికి తిరిగి రాగానే భార్య అలవాటు ప్రకారం, "నీకు బొత్తిగా దూరాలోచన లేదు," అన్నది.



# అతి తెలివి

ఒక ఊళ్ళో బ్రాహ్మణ దంపతులుండేవాళ్ళు. వాళ్ళకు పిల్లా, జెల్లాలేరు. పరమ పిసినిగొట్లు కావటంచేత కడుపుకైనా ఇంత తినే వారు కారు.

ఒకసారి వాళ్ళ ఊళ్ళో తిరణాల వచ్చింది. ఎరిగిన వాళ్ళూ, బంధువులూ వచ్చి పడతారని ఇద్దరి గుండెల్లో రాయిపడింది. మొగుడికి ఏమీ పాలుపోక భార్యను సలహా అడిగాడు. "ఎవరైనా వస్తే ఇద్దరమూ కప్పుకుని పడుకుని, చావు బతుకుల్లో ఉన్నట్టు నటించుదాం," అన్నది భార్య.

తిరణాల మొదటి రోజునే బ్రాహ్మడికి దూరంగా ఇద్దరు బంధువులు కనిపించారు. వాళ్లు ఎలాగూ తమ ఇంటికి వస్తారని గ్రహించి, అతను ఇంటికి వచ్చి, భార్యతో చెప్పాడు. ఆ ఇద్దరూ వచ్చేసరికి దంపతులిద్దరూ మంచాల మీద పడుకుని దారుణంగా మూలుగుతున్నారు. వాళ్ళు వచ్చిన వాళ్ళను గుర్తు కూడా పట్టలేదు.

ఇద్దరూ వెంటనే బయటికి వచ్చి, "తిరణాల మాట దేవుడెరుగు. ఈ దిక్కులేని దంపతులు పెద్ద కష్టంలో ఉన్నారు. బంధుగణానికి తెలియబరచాలి," అని బయలుదేరారు.

వాళ్ళు వెళ్లగానే, తమ ఎత్తు పారినందుకు భార్యా భర్తలు సంతోషించి లేచి కూర్చున్నారు. కాని మర్నాటికల్లా వాళ్ళ బంధుబలగమంతా ఓ యాభై మందివాకా వచ్చి పడింది. ఏం జరిగినదీ అర్థం కాలేదు గాని, వాళ్ళు ఆ తిరణాల పది రోజులూ ఉండి మరీ వెళ్ళారు!

—కుమారి నుపభి రేవతి.





# మంత్రి సాలెం ఎనకోడుకు

ఒకానొక దేశాన్ని ధవళసేనుడనే రాజు పరిపాలించేవాడు. ఒక పర్యాయం ఒక భట్రాజు ఆయన ఆస్థానానికి వచ్చి, ఆయనను సంప్రదాయం ప్రకారం పొగడుతూ, సంగీతంలో ఆయన నారద, తుంబురులను మించినవాడన్నాడు.

ధవళసేనుడు ఆశ్చర్యపోయి, "ఏమి టేమిటీ?" అన్నాడు. లోగడ ఆయనను పొగడిన వాళ్ళు పరాక్రమంలో అర్జునుడి కన్న గొప్పవాడన్నారు. నిజమే కాబోలు ...కున్నాడు ధవళసేనుడు. ఎందుకంటే ...న ఎన్నడూ యుద్ధం చేసే అవకాశం ... అలాగే, ఐశ్వర్యంలో ఆయనను ...తో పోల్చారు. కుబేరుడి వద్ద ...న్నదో తెలియదు గనక, అది ... కావచ్చు ననుకున్నాడు ... ఇలాగే అబద్ధమని నిరూ...లేని కారణం చేత అనేక మంది పొగడ్తలను ఆయన నమ్మవలసి వచ్చింది.

అయితే సంగీతం విషయంలో అలా కాదు. నలుగురిలో తాను పాడి వినిపించి, దాన్ని ఎప్పుడైనా రుజువు చేసుకోవచ్చు. ఇంతకు పూర్వం తనను పొగడిన వారెవరూ తన గానాన్ని పొగడి ఉండ లేదు. ఈ భట్రాజు మొట్టమొదటిసారిగా ఈ సమస్య తెచ్చిపెట్టాడు.

రాజు మంత్రిని దగ్గిరికి పిలిచి, తనకు సభలో గానం చెయ్యాలని ఉన్నదని చెప్పాడు. రాజుగారి కంఠం వింటే చాలు, ఆయన గానం ఎలా ఉండేదీ ఊహించు కోవచ్చు.

ఆయన నిండుసభలో నవ్వులపాలు అయిపోతాడని భయపడి మంత్రి, "తమ గానం అద్భుతంగా ఉంటుందనడానికి సందేహం లేదు. కాని ముందుగా మీరు

కొంత అభ్యాసం చెయ్యాలి. కొలువు చాలించాక మన మిద్దరమూ ఉద్యానానికి పోదాం. అక్కడ మీరు సంగీత సాధన చేతురుగాని!" అన్నాడు.

రాజు ఇందుకు సమ్మతించాడు.

ఉద్యానంలో మంత్రి సమక్షంలో ధవళ సేనుడు కర్ణకఠోరంగా పాడుతూండగా, హఠాత్తుగా వాళ్ళ ముందు ఒక గాడిద ప్రత్యక్షమయింది. వెంటనే రాజుగారు పాడడం ఆపి, ఆశ్చర్యపోతూ, "ఇదేమిటి?" అన్నాడు.

రాజుగారి పాట విని ఆ గాడిద ఎలా ప్రవేశించిందో ఉద్యానంలో ప్రవేశించింది. అది రాజు చుట్టూ తిరగసాగింది. తన గానం ప్రభావం రాజు పొరపాటు లేకుండా అర్థం చేసుకుని, "పద, మంత్రీ, ఇక పోదాం," అన్నాడు.

ఇద్దరూ నడుస్తుంటే గాడిద రాజు వెంటపడింది. రాజు చిరాకుపడి, ఆ గాడిదను బయటికి గెంటెయ్యమని సేవకులతో చెప్పాడు.

కాని, ఆ సాయంకాలం రాజూ, రాణీ ఉద్యానంలో విహరిస్తూండగా, ఆ గాడిద ఓండ్రపెడుతూ వచ్చి రాజు ముందు ప్రత్యక్షమయింది. రాణి చిరాకుపడి, "ఇదేమిటి?" అన్నది.

రాజు గాడిదను మళ్ళీ బయటికి గెంటించాడు.

కాని రాజుగారు ఎప్పుడు ఉద్యానానికి వచ్చినా ఆ గాడిద అక్కడ ప్రత్యక్షం



కాసాగింది. దాన్ని ఎంత దూరాన వదిలినా అది ఉద్యానం చేరుతూనే ఉన్నది. దాన్ని ఉద్యానంలోకి రాకుండా చెయ్యటానికి భారీఎత్తున ఏర్పాట్లు చేస్తే జనంలో గుసగుసలు బయలుదేరి, అనవసరమైన ప్రచారం జరుగుతుంది. అందుచేత రాజు ఆ గాడిదను ఉద్యానంలోనే ఉండేటట్టు ఏర్పాటు చేశాడు. కాని ఆ గాడిద కనిపించినప్పుడల్లా రాజుకు తన సంగీతం గుర్తుకొచ్చి, బాధకలుగుతూనే ఉండేది.

చిన్నతనం నుంచీ తాను సంగీతం సాధన చేసి ఉంటే తన గానం నిజంగా బాగుండేదని ధవళసేనుడికి తోచింది. అందుచేత ఆయన కనీసం తన కొడుకైన సత్యసేనుడికి సంగీతం నేర్పించాలని నిశ్చయించాడు.

సత్యసేనుడు పదహారేళ్ళవాడు. అతను రాచవిద్యలన్నీ అభ్యసించాడు, కాని సంగీతం నేర్చుకోలేదు. తన కంఠం సంగీతానికి సరిపడదని అతని నమ్మకం. అయితే తండ్రి ప్రోత్సహించిన మీదట అతను సంగీతం నేర్చుకోదలచాడు. అతనికి సంగీతం నేర్పడానికి గానాచార్యుల వారిని నియమించారు.

సంగీతసాధన రాజోద్యానంలోనే జరగటానికి ఏర్పాటయింది. రాజు ఉద్యానం చుట్టూ గట్టి కాపలా పెట్టించాడు. తన కొడుకు పాట విని మరోగాడిద రావచ్చునన్న భయం రాజుకు లేకపోలేదు.

తొలిపాఠం ప్రారంభమయింది. గానాచార్యుల వారు చిన్న ఆలాపన చేసి, సత్యసేనుణ్ణి అనమన్నాడు. సత్యసేనుడు పాడుతుంటే రాజుకు దుర్భరం అనిపించింది.

పాఠం కొద్దిసేపు జరిగిందో లేదో, ఉద్యానంలో కట్టిపెట్టి ఉన్న గాడిద, కట్లు తెంచుకుని పారిపోయింది. అది మళ్ళీ ఎన్నడూ ఉద్యానం చాయలకు రాలేదు.

సత్యసేనుడి సంగీత విద్యాభ్యాసాన్ని ధవళసేనుడు వెంటనే ఆపుచేయించాడు. ఆయనకు గాడిదబెడద శాశ్వతంగా వదిలిపోయింది.






సముద్రతీరాన కొందరు బెస్తవాళ్ళు ఉండేవాళ్ళు. ఒక ఇంట చంద్ర అనే అమ్మాయి చాలా అందంగా ఉండేది. పొరుగింటి కుమరప్ప అనే కుర్రవాడూ, చంద్రా చిన్నతనం నుంచీ స్నేహంగా ఆడుకునే వాళ్లు. అందరూ వాళ్ళు భార్యాభర్తలవుతారు అనేవారు. చంద్ర బామ్మ మటుకు నవ్వుతూ, "మా చంద్రకు ఎవరో రాజకుమారుడే వస్తాడులే!" అనేది.

ఒకరోజు ఒక జ్యోస్యుడు అటుగా వచ్చి, అందరి చేతులూ చూస్తూ, చంద్ర చెయ్యి చూసి, "నీకు రాణివాసయోగం ఉన్నది. నిన్ను పెళ్ళాడేవాడు రాజు అవుతాడు." అన్నాడు. చంద్ర ఆ జోస్యం నమ్మింది. ఆమె కుమరప్పతో మునుపటిలాగా మసలటం మానేసింది.

ఒక రోజు కుమరప్ప, "ఏమే, చంద్రా? మనం పెళ్ళి చేసుకుందాం!" అన్నాడు.

"పోపో! నేను పెళ్ళికాకుండా ఉండిపోతాను గాని చేపలు పట్టేవాణ్ణి పెళ్ళాడను," అన్నది చంద్ర.

కుమరప్పకు విరక్తి పుట్టింది. చంద్రకు సాధ్యమైనంత దూరం పోవాలని, వాడు తన పడవ ఎక్కి సముద్రం మీద బయలుదేరాడు. వాడు వల వేసి సముద్రంలో చేపలు పట్టుతూ చాలా కాలానికి ఒక ద్వీపం చేరాడు.

అప్పటికి ఒక పెద్ద చేప తప్ప కుమరప్ప దగ్గిర ఆహారం ఏమీలేదు. వాడు ఆ చేపను నరికేసరికి, దాని పొట్టలో పెద్ద మణి కనబడింది.

ఆ మణిని చూడగానే వాడిలో కొత్త ఆశ పుట్టింది. ఆ మణిని అమ్మితే చాలా డబ్బు రావచ్చు. దానితో తిరిగి వెళ్ళితే చంద్ర వాణ్ణి పెళ్ళాడవచ్చు. ఆ మణికి తగిన వెల రాజుగారే ఇయ్యాలనుకుని,

అజీజా షెరీఫ్

వాడు దూరంగావున్న రాజభవనం కేసి నడిచాడు.

రాజభవనంలో ఏదో ఉత్సవం జరుగుతున్నది. సభ వద్ద చాలామంది గుంపులు గుంపులుగా చేరారు. సభలో రాజూ, రాణీ, రాజకుమారీ ఉన్నారు. ఎవరెవరో రాజకుమారులు కానుకలు తెచ్చి ఇస్తున్నారు. కుమరప్ప రాజకుమారిని చూస్తూనే, ''చంద్రా!'' అని కేక పెట్టాడు. చంద్రకు పెళ్ళి కాబోతున్నదని వాడికి తెలిసింది.

కుమరప్ప ముందుకు తోసుకుపోయి, "చంద్రా, అదృష్టం కొద్దీ సరిగా నీ పెళ్ళి సమయానికి వచ్చాను. నా కానుకగా ఈ మణి తీసుకో!'' అని మణిని చంద్ర చేతిలో పెట్టి, వెనక్కు తిరిగాడు.

రాజు వాణ్ణి వెనక్కుపిలిచి, ''ఎవరు నువు?'' అని అడిగాడు. కుమరప్ప తన కథ అంతా సంగ్రహంగా చెప్పాడు.

ఇంతలో రత్ననిపుణుడు, "ఈ అబ్బాయి తెచ్చిన మణి అన్నిటికన్న విలువైనది,'' అన్నాడు.

రాజు జరిగిన సంగతి కుమరప్పకు చెప్పాడు.

కుంతల రాజుకు సంతతి లేదు. రాణి ఆడపిల్ల కోసం కలవరించింది. రాజు మనుషులు అపూర్వ సౌందర్యవతి కోసం దేశ దేశాలుగాలించి, చివరకు చంద్రను ఎన్నికచేసి, ఆమె తల్లి దండ్రులు కోరినంత ధనం ఇచ్చి తీసుకువచ్చారు. రాజు చంద్రను దత్తత చేసుకుని, వెంటనే ఆమె వివాహం కూడా తలపెట్టి, ఎవరు ఎక్కువ విలువైన వస్తువును కానుక ఇస్తే, వారికిచ్చి పెళ్ళి చేస్తానని ప్రకటించాడు. అందుకే ఆనాడు అనేకమంది వచ్చి కానుకలు ఇస్తున్నారు.

చివరకు కుమరప్ప ఇచ్చిన కానుకే అన్నిటికన్న విలువైనది కావటం చేత, చంద్ర కుమరప్పకే భార్య అయింది. జోస్యుడు చెప్పినట్టు చంద్ర రాణివాసంలో పడటమే కాకుండా, ఆమెను పెళ్ళాడి కుమరప్ప కాలక్రమాన రాజు కూడా అయాడు.



# వైద్య రహస్యం

వెంకటాచార్యులు అనే ఆయుర్వేద వైద్యుడు తన గ్రామంలో బతకలేక, భార్యతోసహా పట్టణం చేరి, ఒక ధనికుడి ఇంట చిన్న భాగం అద్దెకు తీసుకుని, ఇల్లిల్లు తిరిగి మందులు అమ్ముతూ, ఏదో విధంగా కాలక్షేపం చేస్తున్నాడు.

ఒకనాడు అతనితో భార్య, "ఏమండీ, మనం పల్లెలో ఉన్నా, పట్నంలో ఉన్నా ఒకటి గానే ఉన్నది. ఇంటాయన చూడండి, ప్రతి రాత్రి పెరుగు ఉంటేగాని భోజనం చెయ్యడు," అన్నది.

"ఇంకేం? త్వరలోనే నీ చెవులకు కమ్మలు చేయిస్తాలే," అన్నాడు వైద్యుడు.

వైద్యుడి భోజనాల గదికీ, ఇల్లుగలవారి గదికీ మధ్య గోడే అడ్డం. ఒకరాత్రి ఇల్లుగలాయన తన భార్యతో, "పెరుగులోకి కాస్త లవణం పట్టుకురా!" అనటం వైద్యుడి చెవిన పడింది.

"ఇంకేం? నీ కమ్మ ఒకటి పోయిందే," అన్నాడు వైద్యుడు మెల్లిగా భార్యతో.

మరో రోజు రాత్రి ఇల్లుగలవాడు, "అబ్బా, పెరుగు చాలా పుల్లగా ఉంది. కాస్త శొంఠి పొడి పట్టుకురా!" అన్నాడు.

"నీ రెండో కమ్మ కూడా పోయిందే," అన్నాడు వైద్యుడు భార్యతో.

ఆమె కేమీ అర్థం కాలేదు. భర్త చెప్పాడు: "రాత్రి పూట పెరుగు తినటం ఆరోగ్యానికి మంచిది కాదు. ఇల్లుగలాయనకు రోగం వస్తే డబ్బు సంపాదించి నీ చెవులకు కమ్మలు కొందా మనుకున్నాను. కాని పెరుగుకు లవణం సగం విరుగుడు. శొంఠి పొడి పూర్తిగా విరుగుడు. ఆ రహస్యం తెలిసిన వాడు నా దగిరికి ఎందుకు వస్తాడు?"

—వి. యజ్ఞరామయ్య.





# వస్తాదు ప్రజ్ఞ

ఒక జమీందారు దగ్గిర సిద్ధయ్య అనే వస్తాదు ఉండేవాడు. సిద్ధయ్య తన దివాణంలో ఉన్నందుకు జమీందారుకు గర్వంగా ఉండేది. ఆయనకు కుస్తీపోటీలంటే చాలా ప్రీతి; ప్రతి పౌర్ణమికీ కుస్తీ పోటీలు జరిపించేవాడు. పై నుంచి వచ్చిన వస్తాదుకూ, సిద్ధయ్యకూ పోటీ జరిగేది. సిద్ధయ్య ఎలాటి వస్తాదునైనా చిత్తుచేసేసేవాడు. జమీందారు సిద్ధయ్యకు వెయ్యి వరహాలు బహుమతిగా ఇచ్చేవాడు. ఇలా చాలాకాలం జరిగింది. సిద్ధయ్య లాంటివాడు ఉండగా తన సంస్థానానికి ఓటమి ఉండదని జమీందారు నమ్మాడు.

ఒకసారి జమీందారు సిద్ధయ్యతో సహ పక్షులను వేటాడటానికి వెళ్ళాడు. మధ్యాన్నందాకా వేటాడి అలసిపోయి, జమీందారు ఒక మర్రిచెట్టు కింద కూర్చున్నాడు. అతనికి చాలా దాహంగానూ, ఆకలిగానూ కూడా ఉన్నది. చుట్టూ కలయచూడగా ఆయనకు సమీపంలో ఒక తోట కనబడింది.

"అక్కడ ఏవో పళ్ళు కనిపిస్తున్నాయి. ఆకలిగా వుంది. వెంటనే పోయి, నాలుగైదు కోసుకురా, సిద్ధయ్యా." అన్నాడు జమీందారు వస్తాదుతో.

సిద్ధయ్య వెళ్ళి తోటలో ప్రవేశించాడు. రకరకాల పళ్లచెట్లతో తోట ఎంతో నిండుగా ఉన్నది.

సిద్ధయ్య గబగబా పళ్ళు కోస్తూండగా, దూరం నుంచి, "ఎవరది?" అన్న కేక వినిపించింది.

దూరంగా ఒక గుడిసె నుంచి ఒక గడ్డంవాడు పరిగెత్తుకుంటూ వచ్చి, "మా తోటలోకి రావడానికి నీ కెన్ని గుండెలురా?" అంటూ కేకలు వెయ్య

చెల్లూరి సీతారాజేశ్వరరావు

సాగాడు. ఈ కేకలు విని, ఏమిజరిగిందా అని ఆశ్చర్యపోతూ జమీందారు కూడా అక్కడికి వచ్చాడు.

ఆ పళ్ళు జమీందారుగారికి కావాలని సిద్ధయ్య కేకలుపెడుతున్న గడ్డంవాణ్ణి బ్రతిమాలుకున్నాడు.

"ఎవ్వరికీ ఇచ్చేది లేదు. నువు కోసిన పళ్ళకు వెయ్యివరహాలు ఇచ్చుకో," అన్నాడు గడ్డంవాడు.

"అయిదుపళ్ళకు వెయ్యివరహాలా?" అన్నాడు సిద్ధయ్య ఆశ్చర్యంగా.

"నా యిష్టంవచ్చిన ధర చెబుతాను. అంతగతిలేనివాడివి ఎందుకు తోటలోకి వచ్చావు?" అని గడ్డంవాడు పొరుషంగా అడిగాడు.

సిద్ధయ్య వాడిచేత అలా మాటలు పడటం జమీందారుకు నచ్చలేదు. అతను గడ్డంవాడితో, "అబ్బీ, ఇతను ఎవరనుకుంటున్నావు? గండరగండడైన వస్తాదు! తలుచుకున్నాడంటే నిన్ను పచ్చడి చెయ్యటం మా వాడికి క్షణాల మీద పని," అన్నాడు.

ఈ మాట వింటూనే గడ్డంవాడు సిద్ధయ్యతో కలియబడి, క్షణంలో సిద్ధయ్యను మట్టి కరిపించాడు. ఇది చూసి జమీందారు ఖిన్నుడయాడు. అంత గొప్ప వస్తాదు ఒక మామూలు మనిషితో ఓడిపోవటం జమీందారుకు తలకొట్టేసినట్టయింది. ఇంటికి వచ్చినా అతనికి ఆ బాధపోలేదు.



"వాడి దగ్గిర ఏవో మంత్రాలున్నాయి, దొరగారూ!" అని సిద్ధయ్య చెప్పినా అతను నమ్మలేదు. గడ్డంవాడు మామూలు మనిషే. మహత్తులేమీ లేవు.

ఒకరోజు సిద్ధయ్య యాభై గుడ్లూ, రెండు సేర్ల పాలూ ఆరగించి బయటికి వచ్చేసరికి ఎవరో వస్తాదు గుమ్మంలో ప్రత్యక్షమై, సిద్ధయ్యకు నమస్కరించి, "పౌర్ణమినాడు కుస్తీ ఏర్పాటుచెయ్యాలి," అన్నాడు. కుస్తీపోటీలు ఏర్పాటు చేసే అధికారం సిద్ధయ్యదే. ఎవరూ తిన్నగా వెళ్ళి జమీందారును కలుసుకోవడానికి వీలులేదు.

సిద్ధయ్య వస్తాదును లోపలికి పిలిచి, "ఎందుకయ్యా? అనవసరంగా చచ్చిపోతావు! నువు నెగ్గావా మా జమీందారు రాకాసిబిలం రాయి తియ్యమంటాడు. ఆ రాయి కింద ఇప్పటికి ఎంతోమంది నలిగి చచ్చారు. అన్యాయంగా నిండు ప్రాణాలు ఎందుకు తీసుకుంటావు?" అన్నాడు.

"బహుమతి వస్తుందని ఆశతో ఎంతో దూరంనుంచి వచ్చాను," అన్నాడు కొత్త వస్తాదు.

"పోటీ అలాగే ఏర్పాటు చేస్తాను. నువు వెంటనే ఓడిపోతే బతికిపోతావు. గెలిచినందుకు జమీందారు నాకు వెయ్యి వరహాలిస్తాడు. అందులో సగం నీకిస్తాను," అన్నాడు సిద్ధయ్య. వస్తాదు సరే నన్నాడు.

పౌర్ణమినాడు సిద్ధయ్యకూ, కొత్త వస్తాదుకూ పోటీ జరిగింది. కొత్త వస్తాదు క్షణంలో సిద్ధయ్యను వంచేశాడు. "ఓడిపో....ప్రమాదం...." అని సిద్ధయ్య అరిచాడు.

కొత్త వస్తాదు సిద్ధయ్యను పడదోసి గుండెల మీద ఎక్కి కూర్చుని, వేషం తొలగించి, "నీ విద్య పరీక్షించటానికే ఇలా చేశాను. తిండి దొంగవు! వస్తాదువు కావు." అన్నాడు.

జమీందారును చూడగానే సిద్ధయ్యకు మతిపోయింది. ఆ రోజే వాడి కొలువు కూడా ఊడింది.



# తీర్పు

ఒక ప్రసిద్ధుడైన న్యాయాధికారి వద్దకు ఒక తగవు వచ్చింది. ఇద్దరు వ్యక్తులు ఒక రవ్వల ఉంగరం తన దంటే తన దని తగవులాడుకున్నారు.

న్యాయాధికారి ఇద్దరి వాదాలూ విని, ఉంగరాన్ని తన చేతిలోకి తీసుకుని, దాన్ని చూస్తూనే నిర్ఘాంతపోయి, "ఇది రాజుగారి ఇంటి నుంచి దొంగలు కాజేసిన నగలలో ఒకటి. నిజం చెప్పండి, ఈ ఉంగరం మీ కెక్కడిది?" అన్నాడు కోపంగా.

ఆ మాట విని ఇద్దరు వ్యక్తులూ చకితులయ్యారు. వారిలో ఒకడు, ఆ ఉంగరం తనది కాదనీ, రెండోవాడిదేననీ, దొంగతనంతో తన కెలాటి సంబంధమూ లేదనీ తప్పుకో జూశాడు.

రెండవ వ్యక్తి మాత్రం, ఆ ఉంగరం తనదేననీ, ఎక్కడా దొంగతనం చేసినది కాదనీ వినయంగా చెప్పుకున్నాడు.

వెంటనే న్యాయాధికారి మొదటివాణ్ణి మోసగాడుగా నిర్ణయించి శిక్షించి, ఉంగరాన్ని రెండో వాడికి ఇచ్చి పంపేశాడు.

—"వంశీ-వంశీప్రియ."





# మాయదారి వరకట్నం

కౌమార్పురం అనే గ్రామంలో రూపరాం అనే ధనిక భూస్వామికి అంజన్ అనే కొడుకూ, అరుణ అనే కూతురూ ఉండే వారు. అంజన్ పట్టణంలో పెద్ద చదువు చదువుతున్నాడు.

అరుణకు పదహారేళ్ళు రాగానే ఆమె వివాహం గురించి తల్లిదండ్రులు సతమత మయారు. ఆమెకు రాబోయే భర్త విద్యా వంతుడై ఉండాలి; మంచి స్థితిలో ఉండాలి; మంచి కుటుంబంలో పుట్టిన వాడూ, పరువు మర్యాదలు గలవాడూ కావాలి.

ఆ గ్రామంలోనే హరేంద్రుడనే "పెళ్లిళ్ల పేరయ్య" ఉన్నాడు. రూపరాం తన కూతురికి దివ్యమైన సంబంధం చూడమని ఈ హరేంద్రుణ్ణి పురమాయించాడు.

ఒక వారానికల్లా హరేంద్రుడు రూపరాం ఇంటికి వచ్చి, అయిదు మైళ్ళ దూరంలో ఉన్న రతిపురంలో ఉండే చౌధురీల కుటుంబంలో అరుణకు తగిన వరుడు ఉన్నాడని చెప్పాడు. మిగిలిన విషయాలు మాట్లాడే ముందు వారు వచ్చి అరుణను చూడాలి, వీరు కుర్రవాణ్ణి చూడాలి.

"కుర్రవాడు ఏం చేస్తూంటాడు?" అని అరుణ తల్లి హరేంద్రుణ్ణి అడిగింది.

"మన అంజన్ చదువుకునే స్కూలులోనే అతను ఉపాధ్యాయుడుగా ఉంటున్నాడు. అతని పేరు ప్రబోధకుమారుడు," అన్నాడు హరేంద్రుడు.

కుర్రవాడి తండ్రిని పెళ్ళిచూపులకు పిలిచి, అరుణను చూపించటానికి నిర్ణయం జరిగింది. భువనచౌధురీ అరుణను చూడటానికి రూపరాం ఇంటికి వచ్చాడు. అరుణను చక్కగా ముస్తాబు చేసి భువనచౌధురీ ముందుకు తెచ్చారు. ఆయన అరుణను ఇంటి పనులను

గురించీ, వంటా వార్పూ గురించీ ఏవో ప్రశ్నలు వేస్తే, అరుణ అన్నిటికీ తెలివైన సమాధానాలే చెప్పింది. తరవాత ఆమెను లోపలికి పంపేసి అసలు విషయాలకు వచ్చారు.

"పిల్ల తమకు నచ్చిందా, బాబూ ?" అని హరేంద్రుడు భువనచౌధురీని అడిగాడు.

"ఈ పిల్లను మా అబ్బాయికి చేసుకోవాలంటే ఆమె తన వెంట ఎంత బంగారం తెస్తుందో, ఎంత రొక్కం తెస్తుందో ముందు తెలియాలి. రోజులు ఎలా ఉన్నాయో మీకు తెలుసుగా? అచ్చగా పిల్లను చూసి లాభం లేదు, కట్నం కూడా చూడాలి. మాది మరి ఘరానా కుటుంబమాయె. మా పరువు మర్యాదలకు భంగం కలగగూడదు. నా కొడుకు బహుయోగ్యుడు. తగిన కట్నం లేకుండా వాడి వివాహం జరగటానికి వీల్లేదు," అన్నాడు భువనచౌధురీ.

"తమ అభిప్రాయం ఎంతవరకూ ఉన్నదో చెప్పండి," అన్నాడు రూపరాం.

"మీరు లేనివారూ కారు, నా కొడుకు అర్హుడు కాకనూ పోలేదు. అందుచేత నూరు తులాల బంగారు నగలూ, పది వేలు నగదూ, సారే, ఇతర లాంఛనాలూ ఉంటే చాలు. ఇంతకన్న ఎక్కువే




ఇస్తామంటూ వచ్చారు, కాని పిల్ల చాయ తక్కువైపోయింది. నేను కోరినదానికి మీరు అంగీకరించేపక్షంలో పెళ్ళిప్రయత్నాలు ఆరంభించవచ్చు," అన్నాడు పెళ్ళికొడుకు తండ్రి.

"మీవాడు పిల్లను చూడవద్దా మరి ?" అని హరేంద్రుడు ఆయనను అడిగాడు.

"నేను బతికుండగా వాడి పెళ్ళి నా ఇష్ట ప్రకారం జరగాలిసిందే," అన్నాడు భువనచౌధురీ.

"రోజులు మారుతున్నాయి, బాబూ. అదీగాక మాకు కూడా పిల్లవాణ్ణి చూడాలని సహజంగా ఉంటుంది గద!" అని హరేంద్రుడు అన్నమీదట, ఆయన తన



కొడుకును ఒక రోజు చూసి పంపటానికి ఒప్పుకున్నాడు.

వేసవి సెలవులు ప్రారంభం కాగానే అంజన్ ఇంటికి వచ్చి, తన చెల్లెలికి చూస్తున్న సంబంధం గురించి విని పరమానందభరితుడయాడు. ప్రబోధకుమారు డంటే ఆ కుర్రవాడికి చాలా మంచి అభిప్రాయం ఉన్నది.

తరవాత రెండు రోజులకు ప్రబోధకుమారుడు పెళ్ళిచూపులకు వచ్చాడు. అతను అంజన్‌ను చూసి ఆశ్చర్యపడ్డాడు. పెళ్ళికూతురు తన చెల్లెలే అని అంజన్ అతనితో అన్నాడు. అరుణను చూసి ప్రబోధకుమారుడు తృప్తిపడ్డాడు. అతను ఆ మాట చెబితే, అంజన్, "కాని మీ నాన్నగారు మా తలకు మించిన కట్నం అడుగుతున్నారు." అన్నాడు.

"మా నాన్న సంగతి నాకు తెలుసు. కాని ఏం చెయ్యను? ఆయన నా తండ్రి. ఆయనను కష్ట పెట్టలేను. నిజం చెప్పా లంటే నాకు ఈ కట్నాలంటె అమిత అసహ్యం. ఇవి పోవాలని మనస్ఫూర్తిగా కోరుకుంటాను. కాని మా నాన్న నమ్మకాలకు ఎదురు పోలేను. ఈ రెంటినీ ఎలా సమన్వయించటం?" అన్నాడు ప్రబోధకుమారుడు.

"నాకో ఆలోచన తట్టిందండీ. మన స్కూల్లో సోమనాథు డని ఉండే వాడే అతను గొప్ప ఇంద్రజాలం తెలిసినవాడు. అతను మన కేమైనా సహాయపడవచ్చు," అన్నాడు అంజన్.

"ప్రయత్నించి చూడు," అన్నాడు ప్రబోధకుమారుడు.

పెళ్ళి నిశ్చయమయింది. ముహూర్తం కూడా నిర్ణయించారు. రూపరాంకు తీరని దిగులు పట్టుకున్నది. బంగారు నగలు చేర్చాడు గాని నూరు తులాలకు దరిదాపులలో లేవు. రొక్కం కూడా మూడు వేలే ఉన్నది. సోమనాథుడు అంతా తాను సరి చేసానన్నాడు గాని, ఆ యువకుడిలో రూపరాంకు నమ్మకం లేదు.

సోమనాధుడు అంజన్ ఇంటికి రెండు ఇత్తడి పాత్రలతో వచ్చాడు. వాటికి మూతలు ఉన్నాయి. ఆ మూతలు తీస్తే ఆ పాత్రల పై భాగంలో అంగుళం లోతుగల ఇత్తడి అరలున్నాయి. ఈ అరలు ఎలా తయారు చేశారంటే, పాత్రల మీద మూత బిగిస్తే అరలు మూతలో బిగుసుకుంటాయి; మూతలో ఉన్నట్టు బయటికి కనబడవు, ఎందుకంటే మూతల నిడివి అంగుళం కన్న ఎక్కువ. పాత్రలు సుమారు ఒక అడుగు ఎత్తు ఉన్నాయి. వాటి పై భాగం వ్యాసం తొమ్మిది అంగుళాలు, దిగువన ఆరు అంగుళాలు. పాత్రలు చక్కగా మెరుగు దిద్ది, తళతళలాడుతున్నాయి.

తాను ఏం చేయదలచుకున్నదీ సోమనాధుడు అంజన్‌కూ, ప్రబోధకుమారుడికీ చెప్పాడు. వాళ్ళు అతని పథకాన్ని ఆమోదించారు.

పెళ్ళి రోజున అరుణ తనకున్న నగలన్నీ ధరించింది. మరి కొన్ని బంగారు నగలు అక్కడా, అక్కడా అరువు తెచ్చి, ఒక ఇత్తడి పాత్రలోని అంగుళం లోతు అరలో నించాడు, సోమనాధుడు. అలాగే రెండో పాత్రలోని అరలో నూరు రూపాయల కట్టలు పెట్టాడు. ఆ అరల కిటుకు తెలియని వాళ్ళకు ఒక పాత్రనిండా బంగారు నగలూ, రెండో పాత్రనిండా నూరు రూపాయల కట్టలూ ఉన్నట్టు భ్రమ కలుగుతుంది.



వాటిని చూసి భువనచౌధురీ అలాగే అనుకున్నాడు.

"ఇది పెళ్ళికొడుకు సొత్తు గనక అతనే ఈ బంగారం తూకం వెయ్యటమూ, నోట్ల కట్టలు ఎంచుకోవటమూ మా ఆన వాయితీ," అన్నాడు రూపరాం.

ప్రబోధకుమారుడు ఆ పాత్రలను వెంట తీసుకుని ఒక గదిలోకి వెళ్ళి, కొంత సేపుండి తిరిగి వచ్చి, అంతా సవ్యంగానే ఉన్నదని తండ్రికి చెప్పాడు.

పెళ్ళితంతు యథావిధిగా జరిగి పోయింది. వధూవరులను గదిలోకి పంప బోయే తరుణంలో భువనచౌధురీ కట్నం వసూలు చేసుకునేటందుకు వచ్చాడు.

సోమనాధుడు ఇత్తడి పాత్రలను ఆయ నకు చూపి, "మీ సొత్తు మీరు భద్ర పరుచుకోవటం మంచిదే అనుకోండి. కాని, అయ్యా, ఈ బంగారమూ, ఈ డబ్బూ మీరు జీర్ణం చేసుకోగలరా?" అన్నాడు.

"ఎందుకు చేసుకోలేను?" అని భువనచౌధురీ అడిగాడు.

"మీరు పెద్దవారు. ఈ కట్నం పుచ్చు కునే హక్కు మీకు లేదని మీ రెరుగుదురు. ఇది సంఘ ద్రోహం. మీరు శ్రమించి సంపాదించినది మాత్రమే అనుభవించ గలరు. ఈ కట్నం ఎలాటి ఆర్జన? ఈ కట్నం సమాజం దృష్టిలో ఏమిటో చూపి స్తాను," అంటూ సోమనాధుడు రెండు పాత్రల మీద మూతలు మూసి, ఒక్క క్షణం ఆగి వాటిని పైకి ఎత్తాడు. వాటిలో ఇప్పుడు నగలుగాని, నోట్ల కట్టలుగాని లేవు; పాత్రలలో నుంచి రెండు తాచు పాములు బుస్సుమంటూ పైకి లేచాయి.

భువనచౌధురీ బెదిరిపోయి, ఎగిరి గంతేసి, అక్కడి నుంచి పారిపోయాడు.

పాత్రలలో అమర్చిన మాయ అరల కింద సోమనాధుడు తన పెంపుడు పాము లను, కోరలు తీసిన వాటిని ఉంచాడు.

ఈ అనుభవం భువనచౌధురీకి మంచి గుణపాఠం అయింది. ఆయన తన మిగిలిన కొడుకులకు దమ్మిడీ కట్నం కోరకుండా పెళ్ళిళ్ళు చేశాడు.





# వరాలైన శాపాలు

ఒక గ్రామంలో నారాయణ అనే పేద వ్యవసాయదారు ఇతరుల పొలాలు కౌలుకు తీసుకుని వ్యవసాయం చేసి జీవించేవాడు. అతనికి రెండు తీరని కోరికలుండేవి. ఒకటి దేశాటన చెయ్యటం; రెండోది రాజభోజనం తినాలని. అయితే అవి అతని వంటి పేద రైతుకు తీరే కోరికలు కావు.

కనీసం రాజధానిలో జరిగే వసంతోత్సవాలైనా చూడాలని నారాయణ ఒక సంవత్సరం, తన స్నేహితుడైన కేశవుడితో కలిసి, రాజధానికి బయలుదేరాడు. వాళ్ళు పగలల్లా ప్రయాణం చేసి, చీకటి పడే సమయానికి అరణ్యం మధ్యలో చిక్కుకుపోయారు. ఆ రాత్రి తలదాచుకోవటానికి ఒక గుడి కనిపించింది. నారాయణ ఉత్సాహంతో, ఆ రాత్రి ఆ గుడిలో గడుపుదామన్నాడు.

కేశవుడు తల అడ్డంగా ఊపుతూ, "ఇది చండముఖి అనే దేవత గుడి. ఆ దేవత మహా ముక్కోపి. ఆమె పగలల్లా సంచారం చేసి, ఝాముపొద్దుపోయేసరికి గుడికి తిరిగి వస్తుంది. ఆ సమయానికి గుడిలో ఎవరైనా కనిపిస్తే వాళ్ణి శపిస్తుంది. అందుచేత రాత్రివేళ ఎవరూ గుడిలోకి అడుగు పెట్టరు," అన్నాడు.

"దేవత ఆగ్రహిస్తే ఆగ్రహించనీ. నే నింక ఒక్క అడుగైనా ముందుకు రాలేను," అంటూ నారాయణ ఆవులించి, గుడిలోకి వెళ్ళాడు. కేశవుడు ముందుకు సాగిపోయాడు.

గుడిలో నడుమువాల్చిన మరుక్షణం నారాయణకు నిద్ర పట్టేసింది. కొంత రాత్రి గడిచినాక ఎవరో కొరడాతో కొట్టినట్టు తోచి, నారాయణ నిద్ర మేలుకున్నాడు. ఎదురుగా ఒక దేవత, ఎర్రటి

జి. సాంబిరెడ్డి



కళ్ళతో, చేతిలో కొరడా పట్టుకుని నిలబడి ఉండి, "ఎవడ్రా నువు? నా అనుమతి లేకుండా నా గుడిలో పడుకోవటానికి నీ కెంత ధైర్యం!" అన్నది.

నారాయణ ఆమెకు నమస్కరించి, "తల్లీ, నే నొక పేద రైతును. రాజధానికి పోతూ, అలసిపోయి, చీకటి పడేసరికి, ఇక్కడ విశ్రమించాను. నా వల్ల తప్పు జరిగితే క్షమించు," అన్నాడు.

"నిన్ను క్షమించానంటే ఆ సంగతి తెలిసి జనం ఈ గుడిని సత్రంగా మార్చేస్తారు. నిన్ను శపించి తీరాలి. నువు రైతునంటున్నావు గనక, ఒక సంవత్సరంపాటు నీ చేతి నీరు తగిలిన ప్రతి మొక్కా చచ్చిపోవాలి! ఇకనైనా బుద్ధికలిగి ఉండు." అని దేవత అదృశ్యమైపోయింది.

వ్యవసాయం చేసుకుని బతికే తన బోటి వాడు సంవత్సరంపాటు వ్యవసాయం చెయ్యకుండా ఎలా బతకాలా అని విచారిస్తూ నారాయణ రాజధాని చేరాడు.

ఆ యేడు వసంతోత్సవాలు బ్రహ్మాండంగా జరిగాయి. దేశం అన్ని మూలల నుంచీ ఉత్సవాలకు వచ్చిన వ్యవసాయదార్లు రాజుగారితో తమ కష్ట సుఖాలు చెప్పుకున్నారు. అందరికీ దాపరించిన సమస్య ఒక చిత్రమైన కలుపుమొక్క. దాన్ని ఎన్నిసార్లు పీకినా నిర్మూలంకాక, పైరులన్నిటినీ పాడుచేస్తున్నది.

ఈ సంగతి విని నారాయణ రాజుగారికి నమస్కరించి, "నాకు అవకాశం ఇస్తే ఒక్క ఏడాదిలో ఈ కలుపు మొక్కలను పూర్తిగా నిర్మూలించగలను." అన్నాడు.

రాజు అతని శక్తిని పరీక్షించి, అతనికి అలాటి శక్తి ఉన్నట్టు రూఢి చేసుకుని, అతనికి కావలసిన పరివారాన్ని ఇచ్చి, అతను కోరిన ఏర్పాట్లన్నీ చేశాడు. నారాయణ తన పరివారంతో అన్ని గ్రామాలకూ వెళ్ళి, పైరు నాటేముందుగా పొలాలన్నిటికీ తన చేతిమీదుగా నీరు పెట్టాడు. అప్పటికే చేలో ఉన్న కలుపు మొక్కలన్నీ పూర్తిగా నశించిపోయాయి.

ఈ విధంగా నారాయణ కోరికలు నెర వేరాయి. అతను ఒక్క ఏడాదిలో దేశ మంతా పర్యటించి, గొప్ప సత్కారాలు పొందాడు. రాజుగారు అతనికి నూరు ఎకరాల భూమి ఇనాముగా ఇచ్చారు.

మరుసటి సంవత్సరం కూడా నారా యణ వసంతోత్సవాలకు రాజధాని పోతూ, చండముఖి ఆలయం దగ్గిరికి వచ్చేసరికి చీకటి పడటం చేత, ఆ ఆలయంలోనే విశ్రమించాడు. ఒక రాత్రి వేళ దేవత ప్రత్యక్షమయింది.

నారాయణ ఆమెకు నమస్కరించి, "తల్లీ, నీ శాపం వల్ల ఎంతో లోకోపకారం జరగటమే కాక, నా కోరికలన్నీ తీరాయి. దేశాటన చేసి, రాజభోజనం తిన్నాను." అన్నాడు.

చండముఖి కళ్ళ నిప్పులు రాల్చుతూ, "మూర్ఖుడా, మళ్ళీ నన్ను కవ్వించటానికి వచ్చావా? ఈ సంవత్సరం నువు నడిచిన మేర నిలువులోతు గొయ్యి పడుతుంది. నీకు ఎవరైన పెట్టితేతప్ప తిండి ఉండదు. ఇదే నా శాపం." అని అంతర్ధానమయింది.

తాను కదలటానికి లేదని గ్రహించి, నారాయణ తెల్లవారినదాకా ఆ గుడిలోనే కూర్చుని, ఒక ఉపాయం ఆలోచించాడు. తెల్లవారగానే, ఆ దారినపోయే మనిషితో రాజుగారికి కబురుచేసి, ఒక పల్లకీ



తెప్పించుకుని, అందులో వెళ్ళి రాజుగారి దర్శనం చేసుకుని, తన శాపం గురించి వివరంగా చెప్పి, దానివల్ల లాభం పొందే ఒక పథకాన్ని రాజుగారికి సూచించాడు.

అదేమంటే, రాజ్యంలో తవ్వవలసిన పంటకాలవలన్నీ ముగ్గులతో గుర్తుపెడితే, నారాయణ వాటి వెంట నడుచుకుంటూ పోతాడు. అతని వెనకనే నిలువులోతు కాలవలు వాటంతట అవే ఏర్పడతాయి.

ఈ పథకం అమలుజరిగింది. నారా యణ కాలువల కోసం నడవనప్పుడు పల్లకీలో ప్రయాణం చేశాడు. అతను ఎక్కడ ఉన్నా రాజభోజనం బంగారు పాత్రలలో అతను ఉన్నచోటికి వచ్చింది.

ఈ విధంగా నారాయణకు దేవత ఇచ్చిన రెండోశాపం వల్ల దేశానికి మరింత మేలు జరిగింది. ప్రయాసలేకుండా, అతి స్వల్పఖర్చుతో దేశమంతటా పంటకాలువలు ఏర్పడి, ఎంతో కొత్తభూమి సాగులోకి వచ్చింది.

మూడోసంవత్సరం కూడా నారాయణ వసంతోత్సవాలకు పోతూ, మళ్ళీ చండముఖి ఆలయంలోనే చీకటిపడే వేళకు చేరాడు. ఒకఝాము పొద్దుపోయే సరికి దేవత వచ్చింది.

నారాయణ చేతులు జోడించి ఆమెతో, "తల్లీ, నీ శాపాలు అమోఘం! నీ శాపం వల్ల మరొకసారి నాకు దేశాటనా, రాజభోజనమూ, లోకోపకారంచేసిన పుణ్యమూ లభించాయి. నువు దయ ఉంచి శాపాలియ్యటం మానితే, రాత్రివేళ ఈ అడవిలో చిక్కుకుపోయిన మనుషులు ఇక్కడ విశ్రాంతి తీసుకుంటారు. నీకు నిత్యమూ పూజలు జరిగేటట్టు ఏర్పాటు చేస్తాను," అన్నాడు.

చండముఖి పట్టరానికోపంతో, "మూర్ఖుడా, ఇప్పటికి రెండుసార్లు నాఆజ్ఞ ధిక్కరించి నా గుడిలో ప్రవేశించావు. నా శాపాలను అవహేళన చేశావు. ఈసారి నీ దేశాటనా, లోకోపకారమూ ఎలాసాగుతాయో చూస్తాను. నీ దృష్టిలో పడిన ఏ వస్తువైనా భగ్గున మండి మసి అయిపోతుంది. నువు బతికున్నన్నాళ్లూ కళ్లకు గంతలు కట్టుకుని, గుడ్డివాడిలా జీవించవలసిందే!" అని శపించింది.

నారాయణ చప్పున పై పంచ తీసి కళ్ళకు అడ్డంగా తలపాగా చుట్టుకుని, ఆ రాత్రంతా ఆలోచించి, తెల్లవారినాక తడుముకుంటూ గుడి బయటికి వచ్చి, తలపాగా విప్పి, ఒకసారి గుడి కేసి చూశాడు. మరుక్షణం గుడి భగ్గున మండి బూడిద కుప్ప అయిపోయింది. దానితోనే నారాయణ శాపంకూడా పోయింది.

తరవాత నారాయణ అక్కడ ఒక సత్రం కట్టించాడు. అది ప్రయాణీకులకు ఎంతో ఉపయోగపడుతూ వచ్చింది.






అదేవిధంగా మిగిలిన ద్వారాల ముట్టడి కూడా అనుకున్న ప్రకారం జరిగింది. సుగ్రీవుడు అవసరాన్నిబట్టి సహాయపడటానికి ఉత్తర, పశ్చిమద్వారాల మధ్య పెద్ద సేనతో ఉన్నాడు. వానరులు యుద్ధం చెయ్యటానికి చెట్లూ, రాళ్ళూ, పట్టుకున్నారు. మొత్తం వానరసేన లంకను చుట్టుముట్టుతున్నది. వాళ్ళ మూలాన త్రికూటపర్వతం కనబడటం లేదు. ఇక వాళ్ళ కోలాహలం మాట చెప్పనే అవసరం లేదు.

ఆ తరుణంలో విభీషణుడితో చెప్పి, రాముడు అంగదుణ్ణి రావణుడి వద్దకు రాయబారిగా పంప నిశ్చయించి, అంగదుణ్ణి పిలిపించాడు. అతడు రాగానే రావణుడితో తన మాటగా యిలా చెప్పమన్నాడు:

"రావణుడా, బ్రహ్మ వల్ల పొందిన వరాల గర్వంతో నువు అనేక పాపాలు చేశావు. నీ గర్వం నశించింది. నా భార్యను ఎత్తుకు పోయావన్న ఆగ్రహంతో నేను యమధర్మరాజు లాగా వచ్చాను. నిన్ను చంపటానికి లంకాద్వారం వద్ద ఉన్నాను. నువు ఏ బలం చూసుకుని సీతను ఎత్తుకు పోయావో, ఆ బలాన్ని ఇప్పుడు చూపు. సీతను తెచ్చి నాకిచ్చి, నన్ను శరణువేడక పోతే నా క్రూరమైన బాణాలు ఈ లోకంలో రాక్షసులు లేకుండా చేస్తాయి. ధర్మాత్ముడూ, నన్ను శరణుచొచ్చిన వాడూ అయిన విభీషణుణ్ణి లంకకు రాజు చేస్తాను.

23. వానర-రాక్షసుల ద్వంద్వయుద్ధం



నువు ధైర్యంగా యుద్ధం చేస్తే చెయ్యి. అంతేగాని పక్షివై ఎక్కడికన్నా పారిపోదామన్నా అది నేను సాగనియ్యను. నీకు నే నొక మంచి సలహా ఇస్తాను. ఇక నువు లంకను చూడవు. ఇప్పుడే చక్కగా చూసుకో. ఇప్పుడే నీకు నువు ఉత్తర క్రియలు చేసుకో. నీ ప్రాణాలు నా చేతిలో ఉన్నాయి.''

తార కొడుకైన అంగదుడు రాముడిచ్చిన ఈ సందేశం తీసుకుని ఆకాశ మార్గాన అతి శీఘ్రంగా రావణుడి ఇంటికి వెళ్ళి, మంత్రులతో కూర్చుని ఉన్న రావణుణ్ణి చూశాడు. రావణుడూ, అతడి చుట్టూవున్న మంత్రులూ, ప్రశ్నించక ముందే అతను రావణుడికి తన పేరు చెప్పుకుని రాముడి సందేశం వినిపించాడు.

అతి పరుషమైన ఆ సందేశం విని రావణుడికి కోపం వచ్చింది. ఆ కోపంలో అతను కళ్ళెర్రచేసి, ''ఈ దుర్మార్గుణ్ణి వెంటనే పట్టి చంపండి,'' అని మళ్ళీ మళ్ళీ అన్నాడు.

నలుగురు రాక్షసులు ముందుకు వచ్చి అంగదుణ్ణి పట్టుకున్నారు. అంగదుడు కావాలనే వాళ్ళకు పట్టుబడ్డాడు. వాళ్ళు తనను పట్టుకున్న మరుక్షణం అతను వాళ్ళను తన రెండు చేతుల సందున ఇరికించుకుని, ఆకాశంలోకి లేచాడు. అతను ఇంటి శిఖరం మీద వాలి, రావణుడు చూస్తూండగానే రాక్షసులను కిందపడేసి, ఇంటి శిఖరాన్ని విరిచాడు. తరవాత అతను తన పేరు చెప్పుకుని సింహనాదం చేసి, రాముడి వద్దకు తిరిగి వచ్చాడు.

అంగదుడు చేసిన పని రావణుడికి అపశకునం అనిపించింది. అతను ధైర్యాన్నికోల్పోయి, దిక్కులు చూస్తూ, నిట్టూర్పులుపుచ్చాడు.

వానరులు యుద్ధం కోసం ఆత్రంగా కాచుకుని ఉన్నారు. పర్వతాకారుడైన సుషేణుడు, సుగ్రీవుడి ఆజ్ఞ చొప్పున, కొందరు వానర వీరులను వెంటబెట్టుకుని

లంక ద్వారాలు నాలుగూ కలయతిరుగుతున్నాడు. నగరం లోపల రాక్షసులు కూడా ఆయుధాలు ధరించి కోలాహలంగా తిరుగుతున్నారు.

కొందరు రాక్షసులు రావణుడి వద్దకు వెళ్ళి, వానరులు లంకను ముట్టడించారని చెప్పారు.

రావణుడు వెంటనే సింహాసనం మీది నుంచి లేచి తన ఇంటి పైకి వెళ్లి, లంక చుట్టూ వానరసేనలు ఉండటం చూశాడు. త్రికూటపర్వతం అంతా వానరసేనలతో నిండివున్నది. అంత మంది వానరులను ఎలా చంపాలో అతనికి అంతు బట్టలేదు.

రాముడు కూడా లంకానగర ప్రాకారం వద్దకు వెళ్ళి, నగరాన్ని రాక్షసులు ఎంత బాగా రక్షిస్తున్నదీ చూశాడు. ఆ లంక లోనే కదా సీత చిక్కి ఉన్నదన్న ఆలోచన రాగానే అతనికి దుఃఖమూ, కోపమూ కలిగాయి. అతను వానరులతో, "వెంటనే బయలుదేరి శత్రుసంహారం సాగించండి," అన్నాడు.

వానర శ్రేష్ఠులు చెట్లూ, శిలలూ తీసుకుని అందుకు సిద్ధంగానే ఉన్నారు. రాముడు ఇలా అనగానే వానరులు అక్కడక్కడా ప్రాకారం మీదికి ఎగబాకారు. ద్వారాల పైన వానరుల దాడి ఆరంభమయింది.



విభీషణుడు కవచం ధరించి, తన మంత్రులతో సహా రాముడి సమీపంలోనే ఉన్నాడు. గజుడూ, గవయుడూ, గవాక్షుడూ, శరభుడూ, గంధమాదనుడూ అన్నిచోట్లా తిరుగుతూ వానరసేనను రక్షిస్తున్నారు.

ఈ స్థితిలో రావణుడు తన రాక్షససేనలను యుద్ధానికి పొమ్మని ఆజ్ఞాపించాడు. వెంటనే రాక్షసులు సింహనాదాలు చేశారు. భేరీలు మోగాయి. శంఖాలు ఊదారు. ఆవేశపరులై యుద్ధోత్సాహంతో, లంక లోపల రాక్షసులూ, బయట వానరులూ చేసే కోలాహలం మిన్నుముట్టింది.



ఉభయపక్షాలకూ యుద్ధం ఆరంభమయింది. రాక్షసులు గదలతోనూ, శక్తులతోనూ, శూలాలతోనూ, గొడ్డళ్ళతోనూ వానరుల పైకి ఉరికి కొట్టసాగారు. వానరులు రాక్షసుల మీద చెట్లూ, పెద్ద పెద్ద రాళ్ళూ, తమ గోళ్ళూ, కోరలూ ఉపయోగించారు.

కొందరు రాక్షసులు ప్రాకారాల మీది నుంచి వానరుల మీద ఆయుధాలు ప్రయోగించారు.

వానరులు ప్రాకారాల మీదికి ఎగిరి రాక్షసులను కిందపడదోశారు. రాక్షస వానరుల మధ్య అతిభయంకరమైన దొమ్మియుద్ధం జరిగింది.

దొమ్మి యుద్ధంతో బాటు ద్వంద్వ యుద్ధాలు కూడా జరిగాయి. ఇంద్రజిత్తు అంగదుడితోనూ, విభీషణుడి మంత్రులలో ఒకడైన సంపాతి అనేవాడు ప్రజంఘుడనే రాక్షసుడితోనూ, హనుమంతుడు జంబుమాలి తోనూ యుద్ధం చేశారు. అలాగే గజుడికి తపను డనే రాక్షసుడితోనూ, నీలుడికి నికుంభు డనే రాక్షస వీరుడి తోనూ యుద్ధం జరిగింది. సుగ్రీవుడు ప్రఘసు డనే రాక్షసుడితోనూ, లక్ష్మణుడు విరూపాక్షుడితోనూ యుద్ధం చేశారు. ఇలా అనేకమంది వానరవీరులు, రాక్షస వీరులతో భయంకరమైన ద్వంద్వ యుద్ధాలు చేశారు.

ఈ ద్వంద్వ యుద్ధాలలో అంగదుడు ఇంద్రజిత్తు రథాన్నీ, సారథినీ, గుర్రాలనూ నాశనం చేశాడు; సంపాతి ప్రజంఘుణ్ణి చంపాడు; హనుమంతుడు జంబుమాలిని కొట్టాడు; ప్రతపనుడు అనే రాక్షసుడి కళ్ళు నలుడు పీకేశాడు; ప్రఘసుడు సుగ్రీవుడి చేతిలో చచ్చాడు.

నలుగురు రాక్షసులు రాముడి మీద బాణాలు ప్రయోగించారు. రాముడు తన బాణాలతో ఆ నలుగురి తలలూ తెగవేశాడు. మైందుడు వజ్రముష్టి అనేవాణ్ణి పిడికిలితో పొడిచి చంపాడు. సుషేణుడి చేతిలో విద్యున్మాలి చచ్చాడు. మొత్తం

మీద యిలా జరిగిన ద్వంద్వ యుద్ధాలలో చాలా మంది రాక్షసులు వానరుల చేతిలో చచ్చారు.

ఇంతలో సూర్యాస్తమయమై, చీకటి పడింది. కాని యుద్ధం ఆగలేదు. రాక్షసులు యుద్ధభూమి అంతటా తిరుగుతూ, వానరులను భక్షించసాగారు. వానరులు బంగారు నగలనూ, తెల్లగా మెరిసే దంతాలనూబట్టి రాక్షసులను పోల్చి, పట్టి చీల్చారు. ఆ కటిక చీకటిలోనే రామలక్ష్మణులు తమ బాణాలతో అనేకమంది రాక్షసులను చంపారు.

అంగదుడు తన రథాన్ని, సారథినీ, గుర్రాలనూ నాశనం చేసిన తరవాత ఇంద్రజిత్తు తన మాయ చేత అదృశ్యుడై పోయి, ఇప్పుడు రామలక్ష్మణుల మీద నాగాస్త్రాలు ప్రయోగించి, ఆ ఇద్దరినీ బంధించాడు. అతను వాళ్ళతో, "నేను అదృశ్యంగా యుద్ధం చేసేటప్పుడు నన్ను ఇంద్రుడు అయినా ఏమీ చెయ్యలేడు. అల్పులైన మీ రెంత? ఇప్పుడే మీ ప్రాణాలు తీస్తాను," అంటూ సింహనాదం చేశాడు.

బాణాలతో శరీరాలు పూర్తిగా కట్టుబడిపోయిన రామలక్ష్మణులకు ఏమీ కనిపించలేదు. ఇంద్రజిత్తు వేసే బాణాలు వారి మర్మస్థానాలలో తగిలాయి. ఇద్దరూ నేల



మీద పడిపోయారు. వారి రక్తం ఏర్లు కట్టి పారింది. రాముడి స్థితి చూసి లక్ష్మణుడికి జీవితం మీద ఆశ పోయింది.

హనుమంతుడు మొదలైన వానర ప్రముఖులు రామలక్ష్మణుల చుట్టూ చేరి దుఃఖించారు. ఇంద్రజిత్తు కోసం వానరులు అనేకులు అన్ని దిక్కులా వెతికారు, కాని లాభం లేకపోయింది. ఒక్క విభీషణుడే తన మాయతో ఇంద్రజిత్తును చూడగలిగాడు.

ఈ లోపల ఇంద్రజిత్తు రాక్షసులతో ఇలా చెబుతున్నాడు: "చూడండి, రామలక్ష్మణుల పరాక్రమం నా ముందు ఎందుకూ పనికిరాలేదు. వాళ్ళను



55



నా బాణాలతో బంధించాను. ఈ బంధాల నుంచి వారిని ఎవరూ విడిపించలేరు. వీళ్ళు నా చేతిలో చచ్చారు.''

ఇలా అని, ఇంద్రజిత్తు వానర వీరులను తన బాణాలతో నొప్పించసాగాడు. రాక్షసులు ఇంద్రజిత్తును కొనియాడారు. కదలకుండా పడి ఉన్న రామలక్ష్మణులను చూసి, వాళ్ళు చచ్చిపోయారనుకుని, ఇంద్రజిత్తు లంకానగరంలోకి వెళ్ళిపోయాడు.

సుగ్రీవుడు కూడా రామలక్ష్మణుల శరీరాలను పూర్తిగా కప్పిన బాణాలను చూసి భయపడ్డాడు. అతను ఏడుస్తూండటం చూసి విభీషణుడు, ''సుగ్రీవుడా, భయపడకు. ఏడవకు. యుద్ధం అంటే ఇలాగే ఉంటుంది. అన్నప్పుడల్లా విజయమే కలగదు. రామలక్ష్మణులు మూర్ఛపోయారు. తిరిగి వాళ్ళు స్పృహ తెచ్చుకోవచ్చు.'' అని సుగ్రీవుడి కన్నీరు తుడిచాడు.

లంకకు తిరిగి వెళ్ళిన ఇంద్రజిత్తు తన తండ్రిని కలుసుకుని, ''రామలక్ష్మణులను చంపాను.'' అని చెప్పాడు.

రావణుడు పరమానందంతో ఆసనం నుంచి లేచి తన కొడుకును కౌగలించుకున్నాడు. అతను రామలక్ష్మణుల వధ ఎలా జరిగినదీ కొడుకును అడిగి చెప్పించుకున్నాడు.

తరవాత అతను ఇంద్రజిత్తును పంపేసి సీతకు కావలి ఉన్న రాక్షస స్త్రీలను పిలిపించాడు. త్రిజట మొదలుగా గల రాక్షస స్త్రీలు వచ్చారు. రావణుడు వాళ్ళతో, ''ఇంద్రజిత్తు రామలక్ష్మణులను చంపాడని సీతతో చెప్పండి. ఆమెను పుష్పక విమానంలో తీసుకుపోయి, చచ్చి పడి ఉన్న రామలక్ష్మణులను చూపండి. ఇక సీత రాముడి మీది ఆశ వదులుకుని, చక్కగా అలంకరించుకుని నన్ను చేరవచ్చు.'' అన్నాడు.

రాక్షస స్త్రీలు పుష్పకవిమానాన్ని తీసుకుని అశోకవనంలో ఉన్న సీత వద్దకు

వెళ్ళి, సీతను త్రిజటతో బాటు అందులో ఎక్కించి, రామలక్ష్మణులను చూపించటానికి తీసుకుపోయారు.

రావణుడు లంకలో జెండా ఎగరవేయించి, అలంకరించటానికి ఉత్తరువిచ్చాడు; ఇంద్రజిత్తు రామలక్ష్మణులను చంపినట్టు చాటింపు వేయించాడు.

సీత రాక్షసులను చూసింది; వాళ్ళు మహా ఆనందంలో ఉన్నారు. వానరులు దుఃఖంలో ఉండటం కూడా ఆమె చూసింది. బాణాలు శరీరమంతా కప్పి, నేల మీద పడి ఉన్న రామలక్ష్మణులను కూడా ఆమె చూసింది. ఆమెకు దుఃఖం ఆగలేదు.

రామలక్ష్మణులు చచ్చిపోయారనుకుని సీత చాలా దుఃఖించింది. ఆమెకు లోగడ జ్యోతిష్కులు తాను పుత్రవతి అవుతుందనీ, తనకు వైధవ్యం లేదనీ, తన భర్త అశ్వమేధ యాగం చేస్తాడనీ, తాను సామ్రాజ్యానికి పట్టమహిషి అవుతుందనీ, ఎందుకంటే ఆమె పాదాలలో పద్మరేఖలున్నాయనీ, ఏమేమో చెప్పారు; అవన్నీ ఇప్పుడు అబద్ధమయాయి!

ఈ విధంగా దుఃఖించే సీతను ఊరడిస్తూ త్రిజట, రామలక్ష్మణులు చావలేదనీ, మూర్ఛలో ఉన్నారనీ చెప్పింది. రాక్షస స్త్రీలు సీతను పుష్పకవిమానంలో అశోకవనానికి తిరిగి తీసుకుపోయారు.

తరవాత రామలక్ష్మణులలో రాముడు ముందు మూర్ఛ నుంచి బయటపడ్డాడు. అయితే అతను ఇంకా బాణ పాశాలకు కట్టుబడే ఉన్నాడు. చచ్చినట్టు పడి ఉన్న లక్ష్మణుణ్ణి చూసి అతను చాలా శోకించాడు. లక్ష్మణుడు చచ్చిపోతే తాను బతికిఉండటం అసాధ్యమనీ, విభీషణుణ్ణి రాక్షసరాజు చేస్తానన్న మాట నిలబెట్టుకునే అవకాశం తనకు లేకుండా పోయిందనీ, సుగ్రీవుడు మొదలైనవారు వానర సేనలతో కిష్కింధకు వెళ్ళిపోవటం మంచిదనీ రాముడు అన్నాడు. అతను శోకిస్తుంటే, వానర ప్రముఖులంతా అతనితో బాటు శోకించారు.






జీర్ణ మన్నం ప్రశంసంతి,
భార్యాం చ గతయౌవనాం,
శూరం విజిత సంగ్రామం,
గతపారం తపస్వినం. 1

[జీర్ణమైన తరవాత భోజనాన్ని, యౌవనం పోయాక భార్యనూ, యుద్ధంలో గెలిచినాక శూరుణ్ణి, సిద్ధిపొందిన మీదట తపస్సు చేసినవాణ్ణి మెచ్చుకుంటారు.]

కాకః కృష్ణః, పికః కృష్ణః,
కో భేదః పికకాకయోః?
వసంతకాలే సంప్రాప్తే,
కాకః కాకః, పికః పికః. 2

[కాకి నలుపు, కోయిల నలుపు. రెంటికీ భేదం ఏమిటి? వసంతకాలం వచ్చేసరికి కాకి కాకే, కోయిల కోయిలే!]

పృథివ్యాం త్రీణి రత్నాని
జల మన్నం సుభాషితం;
మూఢైః పాషాణఖండేషు
రత్నసంజ్ఞా విధీయతే. 3

[ప్రపంచంలో నీరూ, అన్నమూ, మంచిమాటా అనేవి మూడే నిజమైన రత్నాలు. మూర్ఖులు రాతిముక్కలను చూసి రత్నాలనుకుంటారు.]

## నిజమైన విలువ

Photo by P. V. Subramanyam



బహుమతి
పొందిన వ్యాఖ్య

కుంజరరూపం

పంపినవారు:
టి. జానకి

Photo by P. Sundaram



తిరువళ్ళువార్ నగర్,
మద్రాసు - 16

కుడుముల దేవుడు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







* వ్యాఖ్యలు ఆగస్టు 20 వ తేదీ లోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి. అడ్రసు: ఫోటో వ్యాఖ్యల పోటీ, చందమామ. మద్రాసు-26
* వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు అక్టోబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు




Printed by B. V. REDDI at Prasad Process Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI


xiii

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి. ఆలస్యమైతె మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

**డాల్టన్ ఏజన్సీస్**

'చందమామ బిల్డింగ్స్'

**మదరాసు - 600 026**

x1

# మీరు చదివారా!

# స్నేహబాల

సచిత్ర పక్ష పత్రిక

ఎడిటర్:
నాయుని కృష్ణమూర్తి M.A.(Litt.,)




ఏజెన్సీ వివరాలకు
3.దొరస్వామి గ్రామణి స్ట్రీట్,
వడపళని, మద్రాసు-600026

